గతసంచికలో జగత్యాలలో ఆంధ్ర నాయకులకుజరిగిన సన్మానమునుగూర్చి వచ్చిన ప్రత్యేకవార్తను ప్రకటించితిమి. ఈసారి ఆనాయకులకు పెద్దపల్లిపురవాసులుచేసిన అఖండసన్మానమునుగూర్చి అక్కడి ఆర్యవైశ్య యువజనసంఘ కార్యదర్శి గుంతారాములుగుప్తగారు పంపినలేఖను, కొన్నిపునరుక్తముల కత్తిరించివేసి, ప్రకటించుచున్నాము.

# ఆంధ్రనాయకులకు పెద్దపల్లిస్వాగతము

**అనేకమార్వాడీల ఉత్సాహము—**

**'ఆంధ్ర' శబ్దమున మతభేదములేదని రుజువయినవిధము**

పెద్దపల్లి; ౨౩-౬-౩౭:—

మొన్న మాసులో జాగ్రితము ఆంధ్రమహాసభ స్థాయిసంఘాధ్యక్షులును, శాసననిర్మాణ సభ్యులునగు శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డి (హైకోర్టువకీలు) గారును, బ్ర.శ్రీ. మాడపాటి హన్మంతరావు (హైకోర్టువకీలు) గారును; శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డి (హైకోర్టువకీలు) గారును, కరీంనగరంజిల్లా ఆంధ్రజనసంఘ కార్యదర్శులగు శ్రీయుత బి. ఎల్లారెడ్డిగారును "ఆంధ్రోద్యమమును గురించి ప్రబోధమొనరించుచు" సుల్తానాబాదనుండి తమస్వంత మోటారుకారులలో సాయంకాలము ౬ గంటలకు మాగ్రామమునకు విచ్చేసిరి. అంతకువారము తోజాగ్రితమే వీరియాగమనవార్త జిల్లాయాంధ్రజన సంఘకార్యదర్శులగారి లేఖవలన నెరింగినవారగుట నేనును, మాఆర్యవైశ్య యువజనసంఘసభ్యులును, మ॥రా॥ దివాన్ బహద్దూరు శేటు రాంగోపాల్ లక్ష్మినారాయణగారి మునీమగు బ్ర.శ్రీ. శ్రీకిషన్ జోషీగారును, మ॥రా॥ జమ్నాదాస్‌లాల్ గూరజీకరణ్ దుకాణము జమాసియగు మ॥రా॥ శ్రీకిషన్ శేటుగారును మొ॥ మార్వాడీవర్తకులును, శ్రీయుత వేముల ముత్యం, ప్రసుమల్ల మూర్తిలింగ మొదలగు గల యితరవర్తకులును తక్కుంగలజనమును సుమారు రెండుమూడువందల జనులు త్సాహపూరితులమై మంగళవాద్యములతో "ఆంధ్రమాతాకీ" జేయను జయజయధ్వానములు మిన్నుముట్ట గ్రామము వెలుపలికి వారికెదురేగి సచటనుచిత మర్యాదలగావించి యాన . పుర పుష్పమాలాంకృతులగావించి మహోత్కర్షమున గ్రామములోనికి కొనితెచ్చి బ్ర.శ్రీ. జవ్వాజి సత్యనారాయణగుప్తగారి నిలయమునువిడిపించి కొంతవడి క్షేమసమాచారాదుల నుచ్చరించి తదనంతరము వారియాగమనోద్దేశ్యమును ప్రకటించుటకు సభనేర్పాటు గావించితిమి. ఆంధ్రనాయకులు అయిదునిమిషములు ప్రయాణబడలికను దీర్చుకొన్నతర్వాత మాప్రార్థనానుసారము మ॥రా॥ కొండా వేంకటరంగారెడ్డి గారధ్యక్షపీఠమునలంకరించ బ్ర.శ్రీ. మాడపాటి హన్మంతరావు వకీలుగా రుపన్యసించిరి. వారు దేశపరిస్థితులను దెలుపుచు మాదేశపు నీచదశను, దానివలనమనకును మనదేశమునకును గలుగుచున్న ఆరిష్టనష్టముల వెల్లడిపరచి, ఇందుకుప్రబలకారణముగల విద్యాహీనత, ప్రపంచజ్ఞానము నెరుంగమియనిరి. కొత్తగ మనదేశమున సర్వజనులకు రాత్రిపాఠశాలలు, వార్తాపత్రికలపఠనము, గ్రంథాలయ నిర్మాణములగావించి ప్రశస్తముల విపులముగ విశ్వరుగునించవలెననిరి ఇట్లనేకహితవచనముల నుపన్యసించి కరతాళధ్వనుల మధ్య మనలభీష్టము నలంకరించిరి. తదనంతరము శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారులేచి, యితరదేశములకు మనదేశమునకు విద్యావంతులసంఖ్యాభేదముల దెలుపుచు ఇతరదేశముల కార్యక్రమములు మున్నగుకొన్ని విషయములను దెలిపి, మనదేశపు రైతులదుర్దశ, వారితెలివిమాలినతనము, వర్తకుల ఆశాపూరితములగు దుర్గుణములు, ప్రభుత్వము ప్రజలసౌకర్యార్థము కొద్దివడ్డీమీదనిచ్చుటకు ఏర్పాటుగావించిన యిప్పు అసంఘములు సంఘీభావములవడుట కాధారమగు "కోఆపరేటివుసొసైటీ" వలన గలుగులాభములు వీటినిగూర్చి చక్కగబోధించి, మనదేశవాసులపాట్లకన్నిటికి అవిద్యయే మూలమని రాత్రిపాఠశాలలు, గ్రంథాలయముల నేర్పాటుగావించగోరిరి. ఆపైనుక మాకోరికనుమన్నించి నచట తెలుగుభాషనుకొంచెము మాత్రమె గ్రహించు మార్వాడీవర్తకు లనేకులుండుటవల్ల మ-రా-శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు ఉర్దుభాషలో ఉపన్యసించిరి. వారు "ఆంధ్రమహాసభ కేంద్రసంఘాభి ప్రాయమును, తాముజేయు దేశసేవయు, దానివలన దేశమునకుగలిగి యున్నతదశను చక్కగా నుపన్యసించుచు విద్యావిషయమున మనప్రభుత్వమువారు గావించి సనుచితమగు నేర్పాటులును, తద్వ్యయమునను దానివలన మనవాండ్లు అనుభవించెడు కొద్దిలాభమును దెలుపుచుమందు దేశవాసుల కర్తవ్యమును, విద్యావశ్యకతను గురించి చక్కగాబోధించి నిప్పటినుండి జిల్లాసంఘములనుండి ప్రచారకుల నేర్పాటుగావించి ప్రచారకులను ప్రతితాలూకాకు, ప్రతిపల్లెకును దోలి ఆంధ్రోద్యమమునుగురించి ప్రబోధమొనరించుచు సకలజనులకు నుపకరించు ననేకవిషయముల నెరుంగు నేర్పాటుల గావించెదమనిపుడివి, విద్యననేకరూపముల నవసరించుకొనవలయుననీ, తన్నిమిత్తము రాత్రిపాఠశాలలు, రీడింగురూములు, గ్రంథాలయములు నిర్మాణముగావింప నుద్బోధించి తమవాక్కులవిరమించిరి. ప్రజలలో హర్షధ్వానములను జయజయధ్వానములును, కరతాళశబ్దములును చెలరేగెను. అపిమ్మట మాయూరిపాఠశాలలోపాధ్యాయులలో నొకరగు తుకుప్పవహాశయుడు యీమహనీయుల యాగమనమును వీరిలోకోపకార్యధురీణతను ప్రశంసింపుచు, విద్యావశ్యకతను నేటివిద్యాపరిస్థితినిగురించి విపులముగ నర్థయుక్త ముపన్యసించిరి. తదనంతరము సభ ముగింపబడెను.

సభాసదులు ఆంధ్రోద్యమనాయకుల ప్రశంసింపుచు వారివాక్కుల కొనియాడుచునిండ్లకేగిరి.

తర్వాత నామహనీయులు మాచేనొసంగబడు స్వల్పవిందులనారగించి కొంతవడిముఖ్యమున్న ప్రపంచవార్తలు మున్నగువాటిని తెలిపి సంతోషపరచి నిద్రించిరి. మాఆర్యవైశ్య యువజనసంఘమువారి యుపహారముల స్వీకరించి ఆశీర్వదించి గ్రామము కలియదిరిగిచూచి మంథెనకువెళ్లిరని తెలుపుటకెంతయో సంతసించుచున్నాను.

### ఆంధ్రవైశ్యులు సమయమునకు కానరాకుండుట

తోడనే నేనువైశ్య కులోద్భవుడనగుట దుఃఖింపవలసి వచ్చుచున్నది. ఏలనన యీదినము ప్రాతఃకాలము నామహాశయులరాకను వారియభిప్రాయముల కరపత్రములమూలమున దెలియపరచి సాయంకాలము మంగళవాయుద్యములగొని నింటింటికిందిరిగిన నొక్కవైశ్యమహాశయుడు కానరాకపోవుటయేకాక కంటబడినవారలు కడకుదొలగి మరుగుపడిరి. పరమేశ్వరుడు ఈమాజాతిలోగల కొరంతలనెన్న డేనియు దీర్చిబాగొనరించు నాయనిజాచు చున్నాను.

గుంతారాములుగుప్త

ఆర్యవైశ్య యువజనసంఘ కార్యదర్శి

# కొండా వేంకటరంగారెడ్డి ఎం. ఎల్. సీ. గారి క్రొత్త చిత్తు శాసనములు

ఐదవ ఆంధ్రమహాసభాధ్యక్షులును, హైదరాబాదశాసనసభయందు హైకోర్టువకీళ్ల ప్రతినిధిగా ఎన్నుకొనబడిన సభాసదులునగు శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు ఇదివరకు ప్రవేశపెట్టబడిన చిత్తుశాసనములు కాక ఇప్పుడు మరల మూడుచిత్తుశాసనముల ప్రవేశపెట్టియున్నారు. వానిలో

## ౧ వకీళ్ల శాసనము యొక్క సవరణ

వకీళ్లనుగురించిన మూలశాసనము ౧౩౨౧వ ఫసలీలో ప్రభుత్వమువారివలన అంగీకరింపబడినది—దానిలో అప్పుడప్పుడు కొన్ని సవరణలు జరిగినవి.

దానిలోనిప్పుడుండు నియమముల ప్రకారము రాష్ట్రములోని రెండవతరగతి (దువ్వందర్జా) వకీలు ఎవరైననుసరే ఏడుసంవత్సరముల వరకు న్యాయవాదివృత్తి అవలంబించిన తరువాత పరీక్ష ఇయ్యవలసిన అవసరములేకయే మొదటితరగతి (అవ్వలుదర్జా) వకీలుగా సనదుపొందుటకు అర్హతకలవాడగుచున్నాడు.

అది న్యాయముగానే యున్నది,

కానిమూడవతరగతి (సువ్వందర్జా) న్యాయవాదిగాపొందినవారు, ఎంతకాలము పనిచేసినవారైననుసరే, పరీక్షయియ్యకుండా, రెండవతరగతివకీలుగా సనదుపొందుటకు ఇప్పుడున్నశాసనముప్రకారము అవకాశములులేవు.

ఈలోపమును నివారణచేసి మూడవతరగతి న్యాయవాదులకు న్యాయమును, మొకద్దమాలలో చిక్కియున్నవారికి అనుకూలమును కలిగించుటకై ఈచిత్తుసవరణశాసనము ఉపయోగించుచున్నది.

ఈచిత్తుశాసనము (అనగా ఇప్పటిశాసనము దఫా ౧౧ ఎ— హెచ్చించుట. అంగీకరించబడినపక్షమున, మూడవతరగతివకీలును రెండవతరగతివకీలుగా సనదుపొందుటకు రెండుషరతులు పూర్తికావలయును,

[౧] మూడవతరగతివకీలుపరీక్షలో ఉత్తీర్ణుడైనతరువాత ఉన్నతన్యాయస్థానము [అదాలత్ ఆల్యా] నకుక్రిందిదగు ఏదైనఅదాలతులో ఏడేండ్లవరకు వకీలుగా పనిచేసి యుండవలెను,

[౨] ఖాల్సాఇలాకాలోని తాలూకా మున్సిఫుకంటెతక్కువకానట్టి ఏన్యాయాధిపతియైనను, లేక జిల్లాతాలూక్దారు అయిన ఆట్టివకీలు, పొందినసామర్థ్యము, రెండవతరగతివకీలుయొక్క సామర్థ్యముతో సమానమైనదిగా భావించవచ్చుననిధృవపరచవలయును,

[౩] రెండవషరతులో నిర్ణయింపబడిన పదవిగాగల న్యాయాధిపతి, ఆట్టివకీలుయొక్క వర్తనము మంచిదని ధృవపరచవలయును.

దేశీయులగువారికి అభివృద్ధికలుగు మార్గములను ఏర్పాటులును అవసరము, రెండవతరగతివకీలను మొదటితరగతివకీలగు నవకాశములు కల్పించబడినప్పుడు మూడవతరగతివకీలునకుకూడ అట్టిషరతులకులోబడియే వృద్ధిమార్గమునవచ్చుమార్గములనిర్ణయించుట వృద్ధిదాయకమని భావించి చేయబడిన ఈచిత్తుశాసనము దేశములోనిసుమ్మారుగా వకీళ్లకు—అందరును ముఖ్యముగా పెద్దపరీక్షలనిచ్చు అవకాశము, అనుకూలము లేనివారికి,— ప్రోత్సాహకరముగానుండగలదనుటనిస్సంశయము. ఇది శాసనసభవారి వలన అంగీకరింపబడుగాక!

## ౨ భూమ్యాదాయ (మాల్గుజారీ అరాజీ) శాసనము సవరణ

౧౩౧౭ఫ.లో మనప్రభుత్వమువారుభూమ్యాదాయశాసనము అరాజీ ఖానూను]అనుదానిని శాసనసభద్వారా అంగీకరించియున్నారు_దానిలో అప్పుడప్పుడు కొన్నిసవరణలుజరిగినవి. కొన్నిశాసనములక్రింద దీనిలో శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు [శాసనసభ్యులు] రెండువిషయములలో సవరణలు ప్రతిపాదించియుండిరి-[౧]జేరేబావిలీతరీభూములకు ఖుష్కీ-ధారామాత్రమే తీసికొనవలయునను సవరణ[౨]అబ్కారిచెట్లయొక్క-హక్కు [స్వత్వము]పట్టాదారులకే యుండవలయునను సవరణ ఈరెండుసవరణలును రైతులకు,చాలలాభదాయకములనియు. అందులో ముఖ్యముగా జేరుబావిభూములకు ఖుష్కీ-ధారాలుతీసుకొనవలయుననునది, నిరుపేదయగు తెలంగాణా రైతునకు కొంతవరకు ప్రాణముపోయు నదనియు అందరెరుగుదురు కదా.

ఇప్పుడు శ్రీయుతరెడ్డిగారు రైతులకు ముఖ్యమగుమూడవసవరణశాసనమును,ప్రవేశపెట్టియున్నారు-దానిలోనిసంగతులు ముఖ్యముగా రైతులు గ్రహించదగియున్నవి.

దఫా ౩౬

ఈదఫాలోని ఇప్పటిశబ్దములననుసరించి, పట్టాభూములలోనిఫలవృక్షములుపట్టేదారువికావు-సర్కారువారివి.వాటిఫలములో మాత్రము సగముపట్టాదారుకు చెందుచున్నది-మరియుపదిసంవత్సరముఫలాదాయము యొక్క పదిసంవత్సరములసగటుపైకము పట్టాదారుచెల్లించినపక్షమున, ఫలాదాయముసాంతము పట్టాదారుకు చెందుచున్నది.

యథార్థము విచారించిచూచినచో పట్టాదారుతనభూమిలోని వృక్షములఫలము వల్ల లాభము పొందవలయుననుట న్యాయము-సగముఫలముకొరకు పైకమియ్యవలయునని నిర్బంధము న్యాయముకాదు- మరియొకసంగతి ఏమనగా, పట్టాదారు, తనభూమినితనకు ఇష్టమైనవిధమున బాగుచేసి, వ్యవసాయముజేసికొని లాభముపొంద వీలుండవలయును. అవసరమనుకొన్న పక్షమున దానిలోనిఫలవృక్షములనైనను కొట్టి నేలబాగుచేసికొనుటకు వానికహక్కు కావలయును-పట్టాయిచ్చి లాభము పొందమని చెప్పుచు, ప్రభుత్వమువారు ఫలవృక్షములపైన తమఅధికారముంచుకొనుట న్యాయముగాలేదు. కనుక శ్రీయుతరెడ్డిగారు ఈవిషయమున సవరణ ప్రతిపాదించినారు-ఈసవరణ జరిగినచో, ఫలవృక్షములు పట్టావారుసొత్తు కాగలవు:

దఫా ౫౦

ఫలవృక్షములు హెచ్చుగానున్న భూమిని పట్టాయిచ్చుటకై దరఖాస్తువచ్చినచో. సర్కారులాభము ఫలవృక్షములవలన ఎక్కువగానున్నదనితలంచినచో. తాలూకుదారుఅట్టిభూమిని పట్టాయియ్యకుండా సర్కారుకే ఉంచుకొని వీలుండునట్లు ఈదఫా సవరించబడినది.

కనుక శ్రీయుతరెడ్డిగారి సవరణలు, రైతునకు తనపట్టాభూమిపైన సంపూర్ణాధికారము,మొసగుచున్నది-ప్రభుత్వమువారు అవసరమనుకొనినభూములను ఫలవృక్షలాభముకొరకు పట్టాయియ్యకనిలిపియుంచుకొనుటకు వీలుకూడకలిగించుచున్నది. ఈకారణమువలన ఈసవరణ ప్రభుత్వమునకు రైతులకు,- ఉభయులకు-, లాభప్రదము కనుక అంగీకరింపబడదగి యున్నది-

గ్రామస్థులగు రైతులు ఇట్టిసవరణవలనిలాభమును తెలిసికొనెదరు గాక!

## జాగ్రతగల ప్రయాణికుడు బాధ్యతనువహింపడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటనుంచుకొనుట బాధాకరమును అపాయకరమున్నైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచినయెడల

### సెంట్రల్ యొక్క ట్రావెలర్స్ చెక్కులను ఉపయోగింపుడు

అవి:—

1. నష్టముకలుగకుండ కాపాడును.
2. రొక్కముకంటె సులభముగా తీసికొనిపోవచ్చును.
3. 25,50 100 రూపాయిలు మొత్తములలో దొరకును.
4. హెడ్డాఫీసులోను ముఖ్యమైన బ్రాంచిలలోను దొరకును. ఏబ్రాంచిలో నైనను పేఆఫీసులో నైనను నగదు యివ్వబడును.

## ఆర్. గోపాల్

జనరల్ క్యాప్ మర్చంటు

ఫుల్ సూటర్స్, ఫుల్ అండ్ కార్ట్ సాక్స్, బ్లాజెన్ మొదలైన అన్నిరకములు కాటన్ అండ్ సిల్కులో, ఫ్రాక్స్ అన్నిరకములు, సిల్కు అండ్ కార్ట్ దస్తీలు, ఫర్ ఫోల్డింగ్, చెస్టర్ ఫోల్డింగ్, సాలార్ జంగ్ షేప్, కాశ్మీర్ ఫుల్ మొదలైన అన్నిరకముల టోపీలు సిద్ధముగా దొరకును.

ముఖ్యముగా గమనింపుము:—ఆర్డరుపైకోరినప్రకారం టోపీలనుయిరువదినాలుగుగంటలలో తయారుచేసి యివ్వగలము.

ఆర్. గోపాల్
జనరల్ క్యాప్ మర్చంటు
బన్ స్ట్రాండ్ కోటీ, సుల్తాన్ బజార్, హైదరాబాద్ (దక్షిణ

## ఇస్తెహారు

యిస్తెహారు మహాకమా నజామతు ఆబ్కారి మమాలిక్ మహరూసా సర్కారుఆలీ తా॥ ౧౮ అమర్దాదు సన్ ౧౩౪౬ ఫసలి.

జమీన్దారు జాగీరుదారుసాహెబాన్ మత్తేదారుసాహెబాన్ మవాజె మఖ్తజాతు జాగీరాత్ వ మవాజెమ ఖ్తజాతు ఆమదని సేందీ యొక్క సున్వాంకిస్తు సన్ ౧౩౪౬ సాలు అదాయితాకీఖు ౫వ మహాశేవరు సన్ ౧౩౪౬ సాలునుంచి కాగలదు. చెక్కుల తక్సీము (౫) వ షహాశేవరు సన్ ౧౩౪౬ సాలు ఆదివారమునుంచి (౧౧) వ షహాశేవరు సన్ ౧౩౪౬ సాలు శనివారమువరకు యీ మహాకమాలో అవుతువుండగలదు.

యేజాగీరుదార్లు అయితే చెక్కులు తీసుకునేకొరకు స్వంతముగ రాజాలరో వారలు తమతమ గుమాస్తాలు నవుకర్ల జర్యాన చెక్కులు తెప్పించుకొనవచ్చును. ఫఖ్త.

హాస్పితజుమీబు యిజ్లాసు
మదద్గారు నాజం ఆబ్కారి ౧

## ది నైజాం శుగర్ ఫ్యాక్టరి

లిమిటెడ్

### నోటీసు

జనుల అనుకూలముకొరకు మా రెజిస్టర్డ్ ఆఫీసుయేకాక యీక్రింద వ్రాయబడిన బ్యాంకులలోకూడా ఆర్డినరీ మరియు ప్రిఫరెన్సు షేరుల దరఖాస్తులు తీసుకొనుటకున్ను మరియు పైకమునసూలుచేసి రసీదులు యిచ్చుటకున్ను బోర్డులయొక్క డైరెక్టర్లచే అధికారము యివ్వబడినది.

1. యింపీరియల్ బ్యాంకుఆఫ్ఇండియా హైద్రాబాదు, సికింద్రాబాదు.
2. సెంట్రల్ బ్యాంకుఆఫ్ఇండియా Ltd హైద్రాబాదు, సికింద్రాబాదు.

(Sd) మెస్. డి. డినాటియా
(For) మానేజింగ్ ఏజంటు
ది నైజాం శుగర్ ఫ్యాక్టరి

## కలరా భయములేదు కలరా భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

### విక్టర్ డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్ డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలో కల్ల మావిక్టర్ డ్రాప్స ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

సోల్ యేజంట్లు: విక్టర్ అండు కో
పెస్సగస్తిమూరం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు

# తెలంగాణా వార్తలు

### వెట్టిచాకిరి బాధనుండి కష్టపడుచున్న హరిజనులు

జనగాము తాలూకానుండి ఒకవార్త ఇట్లు న్నది:-

జనగామతాలూకాలో కళివెల్లి, చానూరం, దేవరప్పుల, మంటాపియిగ్రామములలో హరిజనులుమిక్కిలిగా వెట్టిచాకిరిబాధ ననుభవించుచుండిరి-వారలను ముసల్మానుమతములోనికి పరివర్తనము చాలసంతోషకరమైనది-మొదట వారికి వెట్టితొలగినది-కాని ఆగ్రామములోని వర్తకులుకొందరుఆహరిజనులకుకావలసిన ఆహారాదిసామగ్రినీయక వేధించుచుండగా, ఈవిషయమైపోలీసు సబ్‌ఇన్స్‌పెక్టరునకు మొఱపెట్టుకొనబడెనట-సర్కిల్ ఇన్స్‌పెక్టరుగారు వర్తకులకు ఆట్టిబహిష్కారము చేసినచో చర్యగైకొనబడునని హెచ్చరిక చేసినప్పటి నుండి హరిజనులకు సరిగాపదార్థములులభించుచున్నవి. వెట్టికి పిలిచినచో వారలు రామనుచున్నారు- పైగా గ్రామములో అంటుభేదమును పాటించకవలె గురితోతిరుగుచున్నారు-అయి తేవీరలను విచారించగా తేలినదేమనగా వెట్టిచాకిరితొలగించుట.తక్కినహక్కులతో సమానముగా గ్రామములోని మంచినీటిబావుల వసతుల వన్నిటిని పొందుకొననిమ్మట హిందూసంఘీయులు ఉదారముగాఒసగుదురో, ఈహరిజనులుతిరిగి హిందూమతములో చేరుటకు సంసిద్ధులైయున్నారు,

దగ్గరదగ్గరనున్న ఈగ్రామమునకు సమీపములోనేయున్న కొడీమ్యాల గ్రామములో హరిజనులవద్ద వెట్టిచాకిరిదీసికొనకుండ కట్టుదిట్టములు చేయబడినట్లును, ఆగ్రామ హిందూ చతుర్వర్ణములవారును వేర్వేరుగానున్న నీటిచెరువులప్రక్కనే హరిజనులకుగూడ చెరువులు ఏర్పాటుచేయుచుండుటవలనను, గ్రామములో ఆహరిజనులు ఎట్టికొటంకము లేకతిరుగుటకు ఎవరి ఆక్షేపణయు లేకుండుటవలనను, ఆగ్రామములో హరిజనులు ఇప్పుడున్న హిందూమతము నుండి తొలగవలెనని అంతపట్టుదల లేకయున్నారు.

---

### లింగాల్ ఆంధ్రబాలికలపాఠశాల

[విలేఖరి]

మహబూబునగరము; ౧౬-౬-౧౯౩౭ ఫ:-

ఈపాఠశాలలో నలుగురు పంతులమ్మలు. తేది ౧-౯-౪౬ ఫసలినాడు కొందురగుపాఠశాలనుండి కె- లక్ష్మమ్మపంతులమ్మ ఈపాఠశాలకువచ్చినారు- సర్కారుగారు ఈపాఠశాల జారాముచేసినవారి పిల్లలకొరకు నియమించియున్నారు- వారికిపిల్లలకుదప్ప ఇతరులకు ఈపాఠశాలలో విద్యచెప్పబడదు- వారికి అన్నమువస్త్రములు పుస్తకములు మున్నగుసౌకర్యములు సర్కారువారే చేసియున్నారు- ౧౨ సంవత్సరము లవరకు ఈబాలికలను బోర్డింగులోనే పుంచుకొనుటకు చేసియున్నారు-

---

### ఆంధ్రబాలికలపాఠశాల మహబూబునగర్

[విలేఖరి]

మహబూబునగరము; ౧౬-౬-౩౭:—

గతసంవత్సరమువలె ఈసంవత్సరము ఈపాఠశాలనుండి ప్రాథమికపరిక్షలో పదిబాలికలు కూర్చుండి ఒకబాలిక ఫలితముబొందినట్లు తెలియుచున్నది- ఈపాఠశాలయొక్క పెద్దపంతులమ్మయగు లక్ష్మినరుసమ్మను ఇచ్చటినుండి మొగలిగిద్ద పాఠశాలకుమార్చినారు- ప్రస్తుతము ఈపాఠశాలకు కరుణమ్మ పెద్దపంతులమ్మగావచ్చినట్లు తెలియుచున్నది-

---








### బాలికలఉన్నతపాఠశాల, సుల్తానుబజారు హైదరాబాదు

---

#### కళాశాల తరగతులు—వానిఫలితములు

దేశసేవాధురంధరులగు మహనీయులుగొందరు క్రీ॥శ॥ ౧౯౩౪ సం॥న హైదరాబాదులో స్వల్పసంఖ్యగల విద్యార్థినులలో నొకవిద్యాలయమును నెలకొల్పిరి- సంస్థాపకుల యకుంఠితదీక్షవలనను, స్థానికులయాదరాభిమానముల ఫలనను నయ్యదిప్పుడు మూడువందల విద్యార్థినులగలయొక ఉన్నతపాఠశాలయై యొప్పుచున్నది- ఈఉన్నతపాఠశాల పూనానగరములోని (ఇపుడు బొంబాయిలోని) భారతమహిళా విశ్వవిద్యాలయముతో జతపరుపబడి నడుపబడుచున్నది- పైవిశ్వవిద్యాలయపు విద్యాప్రణాళిక స్త్రీలకుమిగుల యుపయుక్తమగునన్నదని విశ్వవిద్యాలయ పట్టప్రదానసభలలో నుపన్యసించిన శ్రీయుత రైట్ ఆనరబుల్ ఎం-హెచ్-ఏ-ఎల్ - ఫిషర్ - ఎం-పి, నవాబ్ మసూద్‌జంగుబహద్దర్ (పూర్వపు విద్యాశాఖాధికారి, హైదరాబాదు) ఎ-బి- ద్రువ, ఎం-ఏ-ఎల్ ఎల్ బి-ఐ-ఇ-యస్- [బెనారస్ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు], సి-ఆర్ - రెడ్డి ఎం ఏ- [ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు] మొదలగు విద్యాధికుల యుపన్యాసము లవలన స్పష్టమగుచున్నది-

ఈపాఠశాలలో నింతవరకు ౧౩ గురు విద్యార్థినులు ప్రవేశపరీక్షలో నుత్తీర్ణులైరి- ఇట్లుత్తీర్ణులైనవారిలో నున్నతవిద్య [కళాశాలవిద్య] జనునభ్యసించు బాలికలు కేరళాశాలకుబోవలసివచ్చుటయు, నయ్యదివ్యయ ప్రయాసాసాధ్యమగుటయు తిలకించియుదారులును స్త్రీవిద్యాభిమానులునగు శ్రీయుత నాంపల్లి గౌరీశంకరమ్మగారు కళాశాలతరగతులు స్థాపించుటకొక సంవత్సరము గ్యయము నిచ్చిన కళాశాలతరగతులు ప్రారంభింపబడుటకుదోడ్పడిరి. ఈకళాశాల తరగతులు ౧౯౩౫సం॥ ఆర్గురువిద్యార్థినులతో ప్రారంభింపబడినవి: ఈఎఫ్.ఏ.సై.ఎ తరగతికి శ్రీయుత ఎం-వెంకటేశ్వర్లు ఎం.ఏ.ఆచార్య రేవ సత్యనారాయణ బిఎస్సి, ఆ-నారాయణరావు బి-శేషయ్య బి:ఏ; కా-మెలుకోటిగార్లు బోధకులుగానుండి ప్రశంసనీయముగ బనిచేసిరి- తరుపరి యఫ్-ఏ-తరగతికిని జి-ఏ-తరగతికిని పి-వెంకటేశ్వరరావు బి.యస్-సిగారు, ఆ.నారాయణరావు ఆర్-యం-జోషిగార్లుబోధకులుగానుండిరి-పరీక్షకుబెళ్లినబాలికలుత్తీర్ణులైరి-విశ్వవిద్యాలయమంతటిలో నాంగ్లమున నత్యధికగుణములసేకరించిన రమాబాయిగారు అను విద్యార్థినికి బహుమతినిచ్చెదమని విశ్వవిద్యాలయాధికారులుప్రకటించిరి. ఎ-బిర్-లలితయను ఎఫ్.ఏ-విద్యార్థిని హరిజనబాలిక్యకి అఖిలభారతహరిజనసేవకసంఘమువారు విద్యార్థివేతనము నిచ్చుచున్నారు.

జీ. ఏ. పరీక్షలో నుత్తీర్ణయైన బాలికలలో సుశీల [రమాబాయి] యనునామెకి న్యాయశాఖలో నుద్యోగులగు శ్రీయుత యజ్ఞన్నరావుగారి కుమార్తె వయస్సు ౧౯సం॥ ఈమె వివాహ మిటీవలనే షోలాపురములో శ్రీయుత పల్లలగుగారితో జరిగినది.

జి ఏ. పరీక్షలో నుత్తీర్ణయైన మరియొక విద్యార్థిని ఇందిరాదేవి యను బాలిక న్యాయశాఖోద్యోగులగు శ్రీయుత వడ్లకొండ నరసింహారావుగారి పుత్రిక వయస్సు ౧౭ సం॥ ఈమెవివాహము మిటీవలనే ఎండగిరి వెంకటరావు బి.ఏ. ఎల్.ఎల్.బి.గారితో జరిగినది. ఇంత పిన్నవయస్సుననే పట్టభద్రురాండ్రైన యీ విద్యార్థినులు అభినందనార్హులు. పట్టభద్రులగువరకు దీక్షతో జదివించిన ఉత్సవరావు. నరసింహారావుగార్లు స్త్రీ విద్యాభిమానుల కాదర్శప్రాయులు ఉత్తీర్ణులైన బాలికలు బొంబాయిలో ఈనెల ౨౭వనాడు జరుగబోవు స్నాతక సభ కాహ్వానింపబడిరి. పైసభలో లక్నో విశ్వవిద్యాలయోపాధ్యక్షులగు శ్రీయుత పరంజపిగారుపన్యసింతురు.

స్వల్పసంఖ్యగల విద్యార్థినులచే స్థాపింపబడిన గొప్ప ఉన్నతపాఠశాల యగుటయేగాక, కళాశాల తరగతులనుగూడ నిర్వహించి పట్టభద్రులనుగూడ నొసంగుచుటజూడ ఏనిపాఠశాల స్వల్పకాలములో నెట్టిసేవజేసినదో స్పష్టము గాగలదు.

వ్యాకరణ శిరోమణి
సి. హెచ్. రంగాచార్యులు.

---

### ఆంధ్రబాలికా పాఠశాల, గోల్లకిటికీ, హైదరాబాదు

---

౧౯౭ అమర్దాద్ సం౧౩౪౬ ఫ॥ బుధవారము శేషయ్యగారి గృహములో జరిగిన వివాహ మహోత్సవసందర్భమున ఈ క్రింద నుదహరింపబడినవారలు, మా పాఠశాలకు సహాయముగాదానమొసగి స్త్రీవిద్యాభివృద్ధికై తమ ఉదారత్వమును జూపినందులకు వినయపూర్వకముగా కృతజ్ఞతలు చెల్లించుచున్నాము.

౧౫ డాక్టర్ వెంకటస్వామి గారు సుల్తాన్ బజారు, ౧౦ గోల్వాలపెంటయ్యగారు గౌలిగూడెం, ౫ గంగనబోయిన రామచంద్రయ్యగారు సికంద్రాబాద్‌పికెట్, ౫ సానం పాపయ్యగారు సికిందరాబాదుపికెట్. ౧౦ జ.మాధవయ్య పాఠశాల కార్యదర్శి గోల్లకిటికీ.

జి. మాధవయ్య
కార్యదర్శి.

---




# గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సం॥ర జ్యేష్ఠ బ॥ ౪

సోమవారము


## మనరాష్ట్రము రైతులగతియేమో?

సంయుక్తరాష్ట్రములో (యు.పి.లో) చెరుకుపంటనుగురించి విచారణచేయుటకు సాక్సేనాగారిని కాంగ్రెసువారు నియోగించిరి. వారు విచారణచేసి తెలిపినదేమనగా, చెరుకుపంట విశేషముగా నేయుండినదనియు రైతులనుండి ఆ యెక్కువపంటను కొనువారు లేకపోవుటచేత ౯౨ లక్షల రూపాయీలవిలువగల పంటచెరుకుల "వంటచెరుకులు"గా నుపయోగించిరనియు తెలిపినారు. ఇతర దేశములవారు ముఖ్యముగా లండనువారు మనచక్కెరను కొనగూడదని నిర్ణయించిరనియు చక్కెరపైసుంకము విశేషముగావిధించిరనియు అందుచేత యీనష్టముకలిగెననియు తెలిపినారు.

మనరాష్ట్రములో నిజాంసాగరుక్రింద చెరుకుపంటకై భూములు ప్రత్యేకించినను పన్నుచాల అధికమగుటచేత రైతులు ఆభూములపై అభిలాషకలవారు కాకపోయిరని యిదివరలో వినుచుంటిమి. ఇటీవలనే అచ్చట చెరుకుపంట పండించుటకై ఒకగొప్పకంపెనీ స్థాపించబడినది. కనుక బ్రిటిషిండియాపరిస్థితులే మనకును ఏర్పడి చెరుకుపంట కట్టెలుగా వినియోగము కావలసినచ్చిన బీదరైతులు నాశనమగుదురు. మనప్రభుత్వమువారు ఈపరిస్థితులు కలుగకుండ కరోడిగిరి ఏర్పాట్లచేతను చెఱకుపండించు భూముల పన్నులుతగ్గించుటచేతను చాల సహాయపడగలరని తలచుచున్నాము.

## నంగపర్వతవీరులు

ప్రపంచ మందంతటను ఎత్తైనపర్వతము హిమాలయము. ఆపర్వతములో ఎత్తైనశిఖరములలో నొకటి "నంగ"పర్వతము. ఈశిఖరమెత్తెంతనో, దానివిశేషములేవో కనుగొనవలెనని యూరోపుఖండములోని కొందరువీరులు సిద్ధమై ఆపర్వతారోహణములో ప్రాణముల సమర్పించుచున్నారు.

ఇటీవలనే మొన్న మొన్ననే ౯ మంది జర్మనులు పర్వతారోహణమునకై బయలుదేరిరి. అందు ౮ మంది మంచుగడ్డలు కదలివచ్చుటచే మృతినొందిరనువార్త చాలవిషాదకరముగా నున్నది. క్రీ.శ. ౧౮౯౫ వ సంవత్సరములో నిపర్వతారోహణ ప్రయత్నము చేయబడెను. అప్పుడు మమ్మెరీ అనునతడా ప్రయత్నములో చనిపోయెను. మరల రెండ్లతర్వాత ౧౯౩౪లో జర్మనువారు ప్రయత్నముచేసిరి. అందును అందరుచనిపోయిరి. ఈసంవత్సరము ప్రయత్నములో నీగతిపట్టినది.

యూరోపుఖండవాసుల ధైర్యమును, పట్టుదలను మెచ్చుకొనవలసియున్నది.

## రాయచూరు కలవు

ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెల్పుచున్నారు:—

"స్థానిక వార్తాపత్రికలలో మాన్విమరియు రాయచూరుతాలూకాలలో మేతకఱవు సంభవించి రైతులు తమపశువులను విదేశములందు తక్కువధరలలో అమ్మచున్నట్లు వార్తాప్రకటితమైనట్లు చూడనైనది. ఈవార్త నిజముకాదు ఒకమాన్వితాలూకాలోమాత్రము మేతకఱవు సంభవించినందున ౭వేల రూపాయీల తకావి ప్రభుత్వముచే ఇవ్వబడినది. అందులో యింకా ౨౦౦ లతకావీలులో నిలువయున్నవి. ప్రస్తుతము తకావీకోరువారునులేరు. అసాధారణముగా కొద్దిసేతిగలవారు వ్యవసాయేతరదివసములందు, వారికిఅవసరమునకంటె యెక్కుడుగలపశువుల నుమాత్రము విక్రయము చేసితిరిగిఅవసరమనిపించినక్రయము చేయుచుండుట వాడుక. ఈ పద్ధతే ఈతాలూకాలోని కొన్ని గ్రామములందు జరిగినది. అంతేకాని కఱవుకారణముగ అమ్మియుండలేదు.

## మాఫీలు

చెఱకుపంటవిషయమై ఇదివరలో ప్రకటించబడిన రూపాయికి రెండణాల మాఫీ (అన్ని జిల్లాలకు) గాక ప్రత్యేకముగా నిజామాబాదు జిల్లాకు రూపాయకు ౪అణాలమాఫీ పన్నులో ప్రభువుగారిచే అనుగ్రహించబడినది.

## సుంకపుశాఖ కార్యాలయములమార్పు

ఔరంగాబాదు మహనూఖానాను కనీజ్ గామాకును. బీదుమహనూఖానాను పరిమెలకును, ఉస్మానాబాద మహనూఖానాను నల్దుగకును మార్చుటను ప్రభుత్వమువా రంగీకరించిరి.

## స్త్రీ డాక్టర్ల ప్రయాణ వ్యయము

సైనికశాఖకార్యదర్శిగారు లేడి డాక్టర్లకు ఇవ్వబడు ప్రయాణవ్యయము ఆమెకుటుంబీకుల చేర్చి యివ్వవలసియుండుటసమంజసమని మ. ఘ.వ. ప్రభువుగారికివిన్నవించుకొనిరి— దానిపై లేడిడాక్టరుకుటుంబములో ఆమె భర్త, సంతానము చేరియుందురు—కాని భర్త భార్యపైననే ఆధారపడియుండిన మరియు సంతానమునుండి సంపాద్యములేకుండిన లేడిడాక్టరుకు ఇవ్వబడుప్రయాణవ్యయములో ఆమెకుటుంబీకులచేర్చియివ్వబడును. ఈవిషయమును ఉద్యోగనిబంధనలలో చేర్చుటకు అంగీకరించుచున్నానని ప్రభువుగారు విశదపరచిరి,

## మద్యపాన మూలమైన హత్యకు మరణశిక్ష ఖాయం

దేవరుద్రతాలూకాలోని గ్రామమగు చాకలివాడలో రామన్న అనువాడుండెను. ఇతనివివాహమునకై ఇతనిఅన్నదమ్ములందరుకలసి తమపిత్రార్జితమైనగృహమును అమ్మివేసి డబ్బంతయు రామన్న అన్నయగు రంగయ్యవద్ద యుంచిరి. కానిరామన్న అడబ్బంతయు తన వశము చేసికొనచూచుచుండెను. కానిరంగయ్యకుఅవగీకారములేదు—౧౩౪౫ ఫసలి షహరేవరు ౧౨౦ం తేదివాడు అన్నదమ్ములుబాగాత్రాగి జగడము తెచ్చిపెట్టుకొనిరి. ఆదేసందర్భములో రామన్న గొడ్డలితో రంగయ్యనెత్తిపై కొట్టిబలమగు గాయముల చేసెను. ఈసంగతి రంగయ్యభార్య వెంటనే పోలీసులకెరిగించెను మరువాడు రంగయ్య మరణించెను.

ఈఅభియోగము ప్రథమమున గుల్బర్గాసెషన్ న్యాయస్థానమందు విచారణ చేయబడి నేరస్థునికి మరణశిక్ష విధించబడెను తర్వాత ఉన్నత న్యాయస్థానమునకు సవరణార్థము పంపించగా న్యాయమూర్తులగు నవాబుజీవన్ యార్జంగుబహద్దురు మరియు మౌల్విమీర్ అలంఅలీఖాన్ గార్లు సెషన్ తీర్పును ఖాయపరచిరి.

దొంగనోట్లఅభియోగములో ప్రథమనేరస్థుడగు యజ్ఞనారాయణపక్షమున మద్రాసు గోప్యలాయరుయొకరు వాదించెగరని తెలియుచున్నది.

## పోలీసువారి ఆపీలు కొట్టివేయబడెను

### పింగిలి కోదండరామారెడ్డి గారి నిర్దోషిత్వము మరల స్థిరపడినది



సుమారు౧౫నెలలక్రింద హైకోర్టుయొక్క ఇద్దిదాయిఇజ్లాసులో, నవాబ్ గాజీయార్జంగు బహదరుగారు, శ్రీయుతపింగిలికోదండరామారెడ్డిగారిపైన పోలీసువారు తెచ్చిన ఫౌజ్దారీమొకద్దమాలో శ్రీరెడ్డిగారు నిర్దోషులని తీర్పుచేసియుండిరికదా. ఆట్టి [౧౧-౬-౧౩౪౫ ఫ.సా] తీర్పుపైన, పోలీసుశాఖవారు ప్రభుత్వమువారిఅంగీకారముపొంది హైకోర్టుయొక్క ముతఫికాఇజ్లాసులో మురాఫాచేసియుండిరి. అమురాఫాపైన ఇటీవల ౨౨అమర్దాదు౧౩౪౬ఫ. తాసీఖున్యాయమూర్తులు నవాబు అస్గరుయార్జంగుబహాదరు, మిస్టర్ వెంకట లక్ష్మణరెడ్డిగార్లు ఉభయపక్షములవాదములను సాకల్యముగా విని వివరముగా తీర్పు చేసిరి. తీర్పుయొక్క ఫలితమేమనగా పోలీసువారుచేసిన అపీలు నామంజూరైనది. అనగా శ్రీయుతపింగిలి కోదండరామారెడ్డిగారి నిర్దోషిత్వముమరల స్థాపితమైనది.

పోలీసువారు ఆరోపించిన నేర మేమనగా, శ్రీరెడ్డిగారు, లాలూఅనువానితో బుచ్చివీరులమవానిపికొట్టించిరి. [౫-౧౨-౪౩] కన్యూలమున వాడుహతుడయ్యెను— కనుక హింది శిక్షాస్మృతియొక్క దఫా ౩౦౨, ౩౪ ప్రకారము శిక్షార్హులు.

ఈఅభియోగములో పోలీసువారు ౧౪ మంది సాక్షుల వాజ్మూలములిప్పించిరి. ఈసాక్షుల వాజ్మూలములవలన నేరము ఋజువుకాలేదని న్యాయమూర్తులభిప్రాయపడిరి, పైసాక్షులలో ఖురసుద్దీనుసాకి మున్సిఫుగారుకూడ ఒకరైయున్నారు. వీరిసాక్ష్యముగురించి, గౌ. న్యాయమూర్తులిట్లుసెలవిచ్చినారు. ఈమొకద్దమాలో ఈమున్సిఫుగారింత ప్రత్యేకమగు అభినివేశము ఏలగాపిరో మాకుతోచదు. చిన్నమాటలపైన పోలీసు వారికి, జిల్లాన్యాయాధిపతికి వారేల ఇత్తిల్లాయిచ్చిరి? ఏలసాక్ష్యము ఇట్టి సాధారణముగు వార్తఅనుగురించి ప్రమాణపూర్వకముగా నిచ్చిరి? ఇట్టివర్తనము ఒకప్రభుత్వాధికారికితగనదికాదు. ముందువారిట్టిపద్ధతిని వదలుకొనెదరనిఆశించుచున్నాము"

తుదకున్యాయమూర్తులిట్లనిరి: పూర్వసాక్ష్యము, ఉత్తరసాక్ష్యము వీనివిసాకల్యముగా పరిశీలించినమీదట క్రిందికోర్టువారు చేసిన తీర్పునకు భిన్నముగానిర్ధారణచేయుటకు కారణములు ఏమాత్రముకనుపడుటలేదు కనుక పోలీసువారుచేసిన అపీలును కొట్టివేయు (నామంజూరుచేయుచున్నాము:

గౌరవనీయులగుపౌరులును గౌరవన్యాయాధిపతులునునగు శ్రీయుత పింగిలికోదండరామారెడ్డిగారిపైన పోలీసువారివలన చేయబడిన గొప్ప నేరారోపణలు, ఉన్నత న్యాయస్థానముయొక్క మొదటిఇజ్లాసు వలనను, ముతఫికాఇజ్లాసువలనను కొట్టివేసి వారి నిర్దోషిత్వము స్థాపింపబడు అందరికిని సంతోషప్రదమైన విషయము.

# ప్రజారోగ్య రక్షణ కేంద్రసంఘ సమావేశము

## వైస్రాయిగారి ఉపన్యాసము

సిమ్లా: జూన్ ౨౩

ఆరోగ్యశాఖ కేంద్రసలహా సంఘముయొక్క ప్రథమసమావేశము నిన్న సిమ్లాలో జరిగెను. ఈసభను ఉపక్రమించవలసినదిగా వైస్రాయినికోరుచు సర్ జగదీశప్రసాదుగారిట్లు పల్కిరి.

దారిద్ర్యము, అజ్ఞానము వ్యాధి అన్యోన్యాశ్రయములనిసే నెఱుగుదుము, కాని, దౌర్బల్యము, వ్యాధులు విద్యాధికుల ఇండ్లలోను, ధనవంతుల ఇండ్లలోనుకూడ విరివిగానున్నవి. శౌచమార్గము లయందు వారుచాలఅశ్రద్ధులైయున్నారు. దేశములో వ్యాపించిన వ్యాధులను నిర్మూలించుటకువారు మార్గదర్శకులైయుండక అపరిశుభ్రతనువారేవహించి మౌనముదాల్చియుండుట అన్యాయము.

భారతదేశములోని జిల్లాలలో సగమువంతు జిల్లాలకును, పురపాలకసంఘములలో ముప్పాతికవంతు సంఘములకును ప్రజారోగ్యరక్షణ ప్రవీణులైన పబ్లికుహెల్తుఆఫీసర్లులేనేలేరు. ౧౯౩౫ సం॥లో ఒకసంవత్సర ప్రాయములోని శిశువుల మరణములు ౧౦ లక్షల ౨౫ వేలకంటె హెచ్చుగానుండెను. మద్రాసు, బొంబాయి, కలకత్తా మున్నగుపెద్దనగరములలో నలుగురుశిశువులు జన్మించిన అందుఒకశిశువుచొప్పున ఒక్కసంవత్సరముప్రాయము నిండకపూర్వమే మరణములు అస్పత్రులలో ౧౧౦ లక్షల మందికి మన్యజ్వరములకై చికిత్సలుచేయబడెను ఎటువంటినికృష్టస్థితిలో ప్రజారోగ్యమున్నదో పై లెక్కలుసూచించుచున్నవి. ఈ దుర్దశనుతొలగించుటకు ఆధునిక వైద్యశాస్త్రీయపద్ధతుల ననుసరించి ప్రజలకుక్షేమకరమైన ఏర్పాట్లనుచేయవలసియున్నది. ఇందు రాష్ట్రీయ ప్రభుత్వములును, కేంద్రప్రభుత్వమును, స్వదేశసంస్థానములునుకలసి పనిచేయవలెను. అట్టిసమిష్టికృషి ఏవిధముగాజరుగవలెనో ప్రజారోగ్యమందలి విర్ణయింపగలదు: ఈకేంద్రమండలిద్వారా ప్రజారోగ్యరక్షణ విషయములలో ప్రజలకు విజ్ఞానమొసగబడును.

### వైస్రాయి యుపన్యాసము

సమావేశమును ఉపక్రమించుచు వైస్రాయిగారిట్లుపన్యసించిరి:—

కాబట్టి భారతదేశములోని స్త్రీలు యీ ఆరోగ్యసమస్యలయందు కొలక్రమమున ఎక్కువశ్రద్ధవహించగలరని నానమ్మకము.

### విట్లీకమిటీ నివేదిక

భారతదేశములోని కార్మికపరిస్థితులనుగూర్చి విచారణసల్పియుండిన విట్లీకమీషను తమ నివేదికలోనొసంగియుండిన సలహాలుమనకు ప్రమాణాధారములైయున్నవి. అవిట్లీకమిటీనివేదిక ప్రకటింపబడి ౬ సంవత్సరములు గతించినవి ఆకమిటీనివేదికలోని సలహాల ననుసరించుటకు ఏమైనప్రయత్నములు జరిగినవేమో చూచుటకు పబ్లికుహెల్తుకమీషనరువార్షికనివేదికలను తెరచిచూచితిని. ౧౯౩౦ సం॥లో విట్లీకమిషను తమ నివేదికలోనొసంగిన సలహాలనుగూర్చిన ప్రస్తావనకించిత్తయినను యీపబ్లికు హెల్తుకమీషనరుల వార్షికనివేదికలో కానరాకున్నవి. ఈ విషయంలో శ్రద్ధవహింపవలసిన బాధ్యతఎంతేని యీ రాష్ట్రీయప్రభుత్వములకును, ముఖ్యముగాస్థానికసంస్థలకునుకలదు,

ప్రాణికోటిని మూడువర్గములుగా విభజింపగలము. వృక్షవర్గము, జంతువర్గము, మనుష్యవర్గము. ఈత్రివర్గప్రాణికోటికిని సమ వికాసమును సమకూర్చుటకై నేనుయీదేశమునకు వచ్చినప్పటినుండియు కృషిచేయనారంభించితిని. ఈమూడింగుఅపరిశోధనలకును, కావలసిన ప్రధానసంస్థలవన్నింటిని నెలకొల్పుటనేటితో పూర్తియైనది. ఈమూడువిధములైన పరిశోధనసంస్థలకును ఒన్నిహితసంబంధము నేర్పరచుటకు తగిన ఏర్పాట్లనుచేయుటకూడ నేడుపూర్తియైనది. వ్యవసాయపునీటిపారుదలకు వ్యవసాయశాఖ కలదు. పశుపోషణచికిత్సలకు సంబంధించిన పశువైద్యశాఖకలదు. ఆహోరులనుపెంచుటకు ప్రతిరాష్ట్రములోను ఏర్పాట్లు జరుగుచున్నవి. పశువుల గ్రాసమునుగూర్చిన సమస్యచాలాక్లిష్టమైనది. దానినికూడపరిష్కరించుట కిప్పుడుప్రూనుకొంటిమి ఈవివిధ పరిశోధనాశాఖలకు పరస్పరసంబంధముకూడ కల్పింపబడినది- ప్రజలకు పుష్టికరమైన ఆహారద్రవ్య ప్రమాణమునుగూర్చి పరిశోధనలు చేయుటకొక పరిశోధనాలయము కూనూరులో నెలకొల్పబడినది- పదార్థముల ధాతుపుష్టినిగూర్చి సలహాలనొసంగుటకొక సలహాసంఘమొకటి యేర్పాటుచేయబడినది-ధాతుపుష్టినిగూర్చి చేసెడిపరిశోధనలకును, వ్యవసాయపరిశోధనలకును పరస్పరసంబంధముకూడ కల్పింపబడినది- అదెట్లనగా, ఢిల్లీలోని వ్యవసాయవిద్యాలయమునందు సుశిక్షితుడైన ఆహారధాతుపరిశోధకుడొకడు నియమింపబడుటకు ఏర్పాటుచేయబడెను- ఆహారద్రవ్య సలహాసంఘమువారి సదుపదేశమననుసరించి ఆహారద్రవ్యశాస్త్రములో మూడుమాసముల శిక్షణతరగతియొకటి ఏర్పాటుచేయబడెను. అట్టిప్రత్యేకశాస్త్రజ్ఞానముగలఅధికారి ప్రతిరాష్ట్రములోను ఒక్కడైననుండవలెనని ఉద్దేశించి యీమూడుమాసముల శిక్షణతరగతి ఏర్పాటుచేయబడెను- ౭ రాష్ట్రములనుండియు ఒక స్వదేశసంస్థానమునుండియు అధికారులువచ్చి ఆశిక్షణమును పొందిరి- మరికొన్నిరాష్ట్రముల అధికారులు యింకను యీశిక్షణము పొందవలసె యున్నారు- ఇంకొకమారుజరిగెడి యీశిక్షణతరగతి రాష్ట్రములఅధికారులు రాగలరనిఆశించుచున్నాను- త్వరలోనే రెండవశిక్షణతరగతి ఏర్పాటుచేయబడగలదు-

ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభల ద్వారాసాగుచున్న ప్రజాస్వామ్యసంస్థలు యీ ట్టిసమిష్టిపరిశోధనలను అభిమానించి ఆదరించి పోషించవలెను- అట్టిఆదరణము ప్రజా ప్రాతినిధ్యసంకలితమైన శాసనసభలద్వారా లభించినయెడల. కొలదిసంవత్సరములలోనే యీపరిశోధనాసంస్థలు విజృంభించిఅనేకవిధములుగా ప్రయోజనకరములుకాగలవు- తద్వారా ప్రజలదుర్గతిని తొలగింపవీలగును- అపరిశోధనాసంస్థలకై వెచ్చింపబడు ద్రవ్యము వృథావ్యయముకానేరదు-

### కేంద్రసంఘముయొక్క వ్యవహారనిర్వహణ విధానము

ఈకేంద్రప్రజారోగ్య సలహా సంఘముయొక్క వ్యవహారవిధానము ఎట్లుండునో కొలదిగా వివరించెదను- అయారాష్ట్రీయ ప్రభుత్వములు చిరకాలమునుండియు నిర్వహించు ఏస్వతంత్రవ్యవహారశాఖగాని యీకేంద్రప్రజారోగ్య సలహాసంఘముఅడ్డమురాదు- ప్రజారోగ్యభివృద్ధికిసంబంధించిన వ్యవహార విషయములలో వివిధరాష్ట్రీయప్రభుత్వములకును, స్వదేశసంస్థానప్రభుత్వములకును కావలసిన సలహాలను యీ కేంద్రసంఘమొసంగుచుండగలదు- అంతర్జాతీయసమాలోచనయందు ఇండియా ప్రభుత్వము పాల్గొనుచుండుటకు యీకేంద్రసంఘము ఆక్కరకురాగలదు- వివిధ రాష్ట్రీయ ప్రభుత్వములకుఅనుభవమునల్ల తెలసిన అనేకవిషయములను యీకేంద్రసంఘము క్రోడీకరించి ఇతర రాష్ట్రములకెరిగించును- ఈసంఘమునందు సభ్యులుగనుండుటకు ప్రతిరాష్ట్రీయ ప్రభుత్వమున్నూ ఒక్కొక్కప్రతినిధిని నామినేటుచేసినది-కేంద్రసంఘమునకు గ్రంథకోశమున్నూ, లెక్కలవివరములసమకూర్పుశాఖయు పూర్తిగా ఏర్పడిన తర్వాత యీసంఘములోచేరియున్న వివిధరాష్ట్రములకు యీ సలహాసంఘము పలువిధములైన సదుపదేశములనొసంగి ఎక్కువగాఅక్కరకురాగలదు- ప్రజారోగ్యశాస్త్రమునందు వివిధ భాషలలో దినదినప్రవర్ధమానముగా వెలువడుచున్నగ్రంథసంపుటి కోరినవారందరికిని లభింపజేయుచుండగలదు-

## ౧౯వ ఆంధ్రరాష్ట్ర మహాసభ

### తీర్మానములు

గత సంవత్సరమున కీర్తిశేషులైన దేశసేవాపరాయణులగు ఆంధ్రులస్మరణనుగూర్చి ఒకతీర్మానము చేయబడినది. అందులో డాక్టర్ నజీర్ అహమ్మద్అను ఆంధ్రమహమ్మదీయుని స్మరణయుగలదు. తర్వాత తాత్కాలికమంత్రివర్గనిర్మాణము అక్రమమనియు, శాసన సభలనెంటనే సమావేశపరచకుండుట అక్రమమనియు, గోదావరిజిల్లా పర్యటనలో తాత్కాలికమంత్రివర్గప్రధానియగు సర్ కూర్మాగారు కాంగ్రెసునుదూషించుచు చేసిన "అధికప్రసంగములను ఖండించుచును ఒక తీర్మానము చేయబడెను మూడవతీర్మానము క్రొత్తపట్టణంలో పోలీసు అక్రమములయెడ నిరసనభావము, దెబ్బలుతిన్న విద్యార్థులయెడ ప్రశంస తెలుపు తీర్మానముకూడ పైతీర్మానమునకు సే అధ్యక్షునిచేప్రతిపాదించబడి ఏకగ్రీవముగ ఆమోదించబడెను. ఆంధ్రులు ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై శాసనసభలలోను వెలుపలనుగూడ ఆందోళనతీవ్రముగ జరుపవలెనను తీర్మానమున్ను, ఆంధ్ర రాష్ట్రములో జనసామాన్యముయొక్క ఆర్థికస్థితినిగూర్చి విచారించుటకొక ఉపసంఘమును నియమించుటకై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘమునకుసూచించుతీర్మానమున్ను ఇప్పుడుండు ఏస్టేటులాండులకు జమీందారులకు ఎక్కువలాభకరమగునట్లు సవరించవలెననుతీర్మానమున్ను ఏకగ్రీవముగ ఆమోదించబడెను. ఇద్దరుఖాదీ, అస్పృశ్యతానిర్మూలనములకు అనుకూలమైన తీర్మానములును సర్వజనసమ్మతములాయెను. చిత్తూరు కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారిజిల్లాలను తిరిగిఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తు క్రిందికి తెచ్చుటకు తీర్మానించబడెను. జమీందారీ విధానమును రద్దుచేయవలెనని శాసనసభాసభ్యులకుహెచ్చరికయు, వేనకువేలుగ కాంగ్రెసులో చేరవలయునని జనులకుహెచ్చరికయుచేయబడెను. స్పెయిను ప్రజల ఆత్మరక్షణ ధైర్యము కొనియాడబడెను. యుద్ధముసంభవించుచో ఆయవకాశమును దేశస్వాతంత్ర్యము సాధించుటకై ఉపయోగించుకొనవలెననియు, కర్షకోద్యమమును కాంగ్రెసుకమిటీలు ప్రోత్సహించవలెననియు, నెలకు రెండువందలరూపాయలకు పైబడిన జీతములలో [గవర్నమెంటుజీతాలుకూడా] నూటికి ౨౫వంతున తగ్గించి ప్రజలపైపన్నుల భారము తగ్గించవలెననియు, ప్రతిగ్రామములో గ్రంథాలయములు, తాలీంఖానాలను ఏర్పాటుచేసి ప్రతివిజయదశమినాడు వ్యాయామప్రదర్శనములనేర్పాటుచేసి కాంగ్రెసుకమిటీల తరఫున బహుమతులనొసంగు ఏర్పాట్లు చేయదగునని యు, హిందీప్రచారమునకు ఆంధ్రులందరుతోడ్పడవలెననియు తీర్మానములు చేయబడినవి.

# స్త్రీలకంటె అన్యాయము

## బానిసలకంటె ఎక్కువలేదు

సంస్థానప్రజలనుగూర్చి డాక్టరు పట్టాభిగారి అభిప్రాయము

"సంస్థానములలో అభివృద్ధికరములైన అభిప్రాయములు ప్రజలయందు వ్యాపించజాలవు. రాజకీయాదర్శములు తలఎత్తజాలవు. రాజకీయ నాయకులును రాజకీయోద్యమములును ప్రారంభదశయందే ఊపిరియాడకుండ చేయబడును. సంస్థానములు బ్రిటిషిండియాప్రజలకు ప్రపంచములో విదేశములకంటె హీనము. బ్రిటిషిండియా రాష్ట్రములప్రజలు సంస్థానములలో విదేశీయులుగ భావించబడుదురు. సంస్థానప్రజలగతియు బ్రిటిషుయిండియా రాష్ట్రములలోనింతే సంస్థానములలో ప్రజలు బానిసలకంటె మంచిస్థితిలోలేరు. వారలకు పౌరునికి ఉండవలసిన ముఖ్యములైన హక్కులేలేవు వారలకు ఏమాత్రమైనను ఉపయోగించగల ప్రజాప్రతినిధిసంస్థలు లేవు. బాధ్యతాయుతప్రభుత్వము అంతకుముందేలేదు. స్వాతంత్ర్యాభిలాష కృత్రిమనిర్మితములైనహద్దులను దాటిపోరాదని అనుకొనవీలులేదు. అట్లనుకొనుట వఱదలు, కఱవులు, తుపానులు, భూకంపములు సంస్థానములనను రాష్ట్రములననుమధ్యమందు సరిహద్దులను దాటరనుకొనుటవంటిదే యగును." అని అఖిలభారత సంస్థానప్రజా మహాసభాధ్యక్షులగు డాక్టరు భోగరాజు పట్టాభిరామయ్యగారు మొదటి ఒరిస్సాసంస్థానముల ప్రజలమహాసభకు అధ్యక్షతవహించి ఉపన్యసించుచు చెప్పిరి.

"మనము భారతజాతియందు అంతర్గతమై సమానవిశ్వాసము, సమానపూజాపద్ధతి, సమానచారిత్రిక సంప్రదాయము, సమానజీవప్రపంచముగల భిన్నశాఖలవారము. పరిపాలనసౌకర్యమునకై ఏర్పరచబడినసరిహద్దులు క్రొత్తగావచ్చినవి. అట్టికృత్రిమములైన పరిహద్దులు, అహద్దులకిరుపక్కల వనుభవించకుండ చీలదీయజాలవు.

"అట్లైన మరిభారతదేశములో బ్రిటిషు సంస్థానప్రజలకు రాష్ట్రప్రజలుఅనుభవించు ఓటుహక్కు ఉండరాదని ఏలతలచుచున్నారో మిక్కిలిఆశ్చర్యముకాదా? వారుసంస్థానప్రజలను అడవిమనుష్యులని తలచుచున్నారా' లేక ఘోషావరణలోనున్నమ స్త్రీలు నిరర్థకులు, చెవిటివారు, మూగవారు, లేక దివాలాతీసినవారలు అని తలచుచున్నారా? ఈరెండవవర్గములో స్త్రీలకు ఇటీవలనే సీటుహక్కులభించినది. మతి సంస్థానముల ప్రజలనేల అప్పులు, భారములు, బాధ్యతలుమాత్రమే కలిగి, ఒక్కఆదాయముగాని, ప్రయోజనములుగాని, అధికారములుగానిలేని చట్టీలవలెనో లేక వస్తువులవలెనో ఏలచూడవలెను? బహుశా బ్రిటిషువారు ఆప్రజాప్రభువులగు సంస్థానాధిపతులకులోబడి ఓటుహక్కుగల ప్రజలుండదగదని తలచుచున్నారా! అయినచో, తప్పు సంస్థానాధిపతులదో లేక బ్రిటిషువారిదోఅయియుండవలయునేకాని సంస్థానప్రజలదికాజాలదు. సంస్థానప్రజలు బ్రిటిషిండియారాష్ట్రప్రజలంత తెలివిగలవారలు, దైవభక్తియుతులు, త్యాగబుద్ధిగలవారలునైయున్నారు.

ఫెడరేషనునుగూర్చి పట్టాభిగారిట్లుచెప్పిరి:-

సంపూర్ణముగ విభజించిచూచినచో ఫెడరేషను భారతదేశములో అంతరిని నాశనముచేసి ఒక్కబ్రిటిషువారుమాత్రమే లాభించునదిగ కనపడగలదు. ఈవికృతాంగమును సంస్థానాధిపతులు ఒక్కమాటగా త్రోసివేయజాలకపోవుట విచారకరము. ఫెడరేషనువల్ల సంస్థానాధిపతులకు లాభములేదు, వారిప్రజలకు లాభములేదు. కాని వాణిజ్యవాణిజ్యులకు బ్రిటిషుప్రభుత్వమునకుమాత్రము లాభము. ఈ ఫెడరేషను బ్రిటిషువారికి భారతదేశములో మూడవవంతును విడదీసి, భారతదేశ స్వాతంత్ర్యోద్యమముతో పోరాడుటకు దుర్గముగా ఉపయోగించుకొనగలందులకైయిచ్చుచున్నది.

కాంగ్రెసుతో సంస్థాన సంబంధమునుగూర్చిఇట్లుచెప్పిరి:-

"సంస్థానప్రజలు తమ సంస్థానములందు కాంగ్రెసుసంస్థల నేర్పాటుచేసికొనవచ్చును- రాష్ట్రకాంగ్రెసుసంఘములు సంస్థాన ప్రజలు కాంగ్రెసుసభ్యులుగ చేరుటకు వీలులేనట్లు తమ సంఘనియమములను ఏర్పాటుచేసుకొనరాదు- అట్లు యేరాష్ట్రసంఘమయిన నిర్ణయించినచో సంస్థానప్రజలు కాంగ్రెసుకార్యకారిణీసంఘమునకు ఫిర్యాదుచేయవచ్చును- నేడు కాంగ్రెసుజనముతో సంబంధమునుయెక్కువచేసికొనుచున్నది- అట్లుచేసికొనుటలో సంస్థానములందలిప్రజాశక్తులనుకూడ వశపరచుకొనుట అవసరము-

స్థూలముగ కార్యవిధానమును సూత్రములనునిర్ణయించుటకు కాంగ్రెసుసంస్థ యున్నను, సంస్థానములందలి అంతరంగిక వ్యవహారములనుగూర్చి, పరిపాలనసుగూర్చి చర్చించినిర్ణయించుకొనుటకు రాజస్థానసభలు, రాష్ట్రీయప్రజాపరిషత్తులను స్థాపించుకొనుటకు కాంగ్రెసు కాదనదు-

"సంస్థానములు బ్రిటిషిండియారాష్ట్రముల వ్యవహారములందు జోక్యము కలిగించుకొనవనియు, సంస్థాన వ్యవహారములందు రాష్ట్రములు జోక్యముకలిగించుకొనరాదనియు చెప్పుచున్నారు- ఈబూటకములు బయలుపడుట కెంతోకాలముపట్టదు- స్పెయిను యుద్ధమునందును, అబిసీనియాయుద్ధమునందును జర్మనీ, ఇటలీ, లేక ఫ్రాన్సు, ఇంగ్లాండులు తటస్థముగనున్నారన్నచో యెంతనిజమో, రాష్ట్రములందు జరుగుచున్న రాజకీయోద్యమమునందు సంస్థానములు సాల్గొనజాలవనుటయు అంతనిజమే- అయితే జోక్యముకలిగించుకొనుట బయటకికనబడుటలేదు-

"రాష్ట్రములందు జరుగుచున్న పోరాటము భారతీయప్రజలకును బ్రిటిషువారికిని జరుగుచున్నది- నిరాయుధులును, అసహాయులునగు భారతీయుల నెదురొక్కనుటకు బ్రిటిషువారికి కోటబురుజులవంటివి సంస్థానములుఅంతకన్న యెక్కువే- ప్రజలఉద్యమములను అణచివేయుటకు బ్రిటిషుఅధికారులకు ఆయుధములు, మందుగుండు సరఫరా చేయుడిపోలుగా యీసంస్థానములుపయోగింపబడును-

సంస్థానప్రజలకర్తవ్యము నిట్లుసూచించిరి:-

"అందుచేసంస్థానములసమస్య రాష్ట్రసమస్యలకన్న యెక్కువచిక్కులుగలది- ఈచిక్కులనుతొలగించుటకు ప్రథమకర్తవ్యము సంస్థానప్రజలలో ప్రబోధముకలిగించుట- వారుఅజ్ఞానులును అశక్తులును అయియున్నారు- వారికి శక్తివారికెరుకపరుచవలెను- సంస్థానములు బ్రిటిషుఇండియాకన్న ఏబదేండ్లు వెనుకబడియున్నవన్నమాటనిజమే- సంస్థానప్రజలు బ్రిటిషుఇండియాలో వారివలెనేఅభివృద్ధికొరకు పాటుపడవలెను- బ్రిటిషుఇండియాలో కృషిచేయుచున్న సోదరులఅడుగుల ననుసరించవలెనన్న, సంస్థానప్రజలుగూడ వారివలెత్యాగము ల కష్టములనోర్చుకొనుటకు సిద్ధముగానుండవలెను- అపనిచేసినచో స్వశక్తిపై నిలువగల్గుదురు- లేకున్న ఇండియా రాజకీయాంగమునందు పక్షవాతముపట్టిన అవయవమువలె నిర్జీవమైయుందురు- రాష్ట్రములందలి ప్రజలనుగూడ నిరర్థకులుగ జేసినవారగుదురు-





## మ. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే

# ప్రకటన

శికింద్రాబాదునుండి బెంగుళూరుసిటీకి త్రూగాపోయేబండ్లు

ఒకటిరెండు తరగతులుగలిగి శికింద్రాబాదునుండి బెంగుళూరు సిటీవరకు పోవునట్టి ఒక హైలుపెట్టె మా రైల్వేలో 36డౌను, 35 అప్ ప్యాసింజరుబండ్లలోను యం. యస్- యం. రైల్వేలో హుబ్లి సేంజకు మరియు బెంగుళూరు మెయిలులోను పోవుచుండును. ఆబండి 31 వ జులైవరకుమాత్రమే నడుచుచుండును.

శికింద్రాబాదు
8 జూన్ 1937

ఎ. డబ్ల్యు. వాట్సు
ఆఫీషి. చీఫ్ట్రాన్సు పోర్టేషన్ సూపరింటెండెంటు

## మ. ఘ. వ. నిజాం స్టేటు రైల్వే

# నోటీసు

మ. ఘ. వ. నైజాంస్టేటు రైల్వేలోని బోనకాలు స్టేషన్ద్వారా యుంటూయున్న జగయ్యపేట జౌట్ ఏజన్సీ అన్నివిధములైన వ్యాపారములకు జులై 1 వ తేదినుండి మూసివేయబడినది.

# ఆంధ్ర రాష్ట్ర మహిళా సభ

నంద్యాలలో ౨౦ జూనువాడు ప్రారంభమైన ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ కధ్యక్షత వహించి శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారు భారతదేశ స్వాతంత్ర్యమునకై కాంగ్రెసు చేయుచున్న కృషియొక్క చరిత్రను నేటివరకు వివరపరచి నూతన రాజ్యాంగమునుచించి చెండాడెను. నూతనరాజ్యాంగములో భారతి దేశజనము అర్ధనగ్నముగాను నిలువ్రగాను చీలికలు చేయబడిన తీరును వివరించుచు ఇట్లు చెప్పెను. ఫెడరల్ శాసనసభ కడు చిత్రముగ నేర్పాటు చేసిరి. మొత్తము ౩౭౫ సభ్యులలో ౧౨౫ మంది సంస్థానాధీశ్వరులచే నియమింపబడుదురు. సంస్థాన విషయములలో ఈసభ జోక్యము లేనందు జేయునటులయే గాక బ్రిటిష్ ఇండియా పరిపాలనములో జోక్యమునకు సంస్థానాధీశ్వరులచే నియమింపబడు సభ్యుల కధికారమివ్వబడెను. సంస్థానాధీశ్వరులెవరు? రాజప్రతినిధి క్రింద కీలుబొమ్మలు. అట్టి వీరిచే నియమితులగు సభ్యులసంగతి వేరుగ చెప్పనేల? మిగతసభ్యులలో మహమ్మదీయులకు సుమారు ౫౦ మందికి ప్రాతినిధ్య మివ్వబడెను. అనగ మహమ్మదీయులు సంస్థానసభ్యుల కలయికతో ప్రభుత్వము ఆపిచ్ఛిన్నముగ జరుపవచ్చును. అంతియేగాక, భూస్వాములు, వర్తక ప్రముఖులు ఆంగ్లో ఇండియనులు, ఐరోపియనులు, కార్మికులకు గూడ వేరువేరుగ విభజించి, వేరువేరు నియోజకవర్గముల నేర్పాటుచేసి యుండిరి అందు స్త్రీలకుకూడ ప్రత్యేక నియోజకవర్గముల నేర్పాటు చేసిరి. ఈ శాసనసభను కాంగ్రెసువారు అధికసంఖ్యాకులతో నాక్రమింపకుండుటయే ప్రధానోద్దేశ్యము.

రాష్ట్రనిర్మాణముల సంగతిచూదుము. హిందూదేశము ౧౧ రాష్ట్రములుగ విభజింపబడెను. మహమ్మదీయులకు చాలరాష్ట్రములు స్వాధీనమగునను నుద్దేశ్యముతో రాష్ట్రనిర్మాణములను జేసిరి. జరిగిన యెన్నికలలో ఇయ్యది బాగుగ బోధ పడినది, అనగ హిందూదేశమును రెండు తెగలవారికి విభజింపబడెను. మరియు కొన్ని రాష్ట్రములలో రెండు శాసనసభలు నేర్పాటు జేసి, పైసభలయందు జమీందారులకు భూస్వాములకు పెత్తనమివ్వబడినది.

కాంగ్రెసు నాయకులు గవర్నర్లనుండి హితులు కోరుటనిట్లు సమర్థించినది. రాష్ట్రగవర్నరులు హిందూదేశప్రజలకు ఉత్తరవాదులుగాక బ్రిటను పార్లమెంటువారికే బాధ్యులట. మంత్రులు హిందూదేశపు ప్రజలకు బాధ్యులటమా చితిరా ఈ ద్వంద్వవిధానము. రాష్ట్రప్రజలకు బాధ్యుడుకాని గవర్నరుతో, ప్రజాప్రతినిధులైన మంత్రులు ప్రజలకుత్తరవాదులయినమంత్రులకు, యెట్లుపొత్తుకుదురగలదు? రాష్ట్రస్వాతంత్ర్యమన నెట్టిదియో తెల్లముచేయుచున్నది. దూరదృష్టిగల కాంగ్రెసు ఈయంశములన్నియు గమనించియే [illegible] డెను. ప్రస్తుతస్థితిలో ముందు [illegible] సూచించె నాయకులు పదవులచూట [illegible] ఈ పట్టును వదలింపకున్న, యీనూతన సంస్కరణలను భూస్థాపన చేయుబడింట్లే, లేమువని, శ్రాద్ధాదికర్మోపన్యాసములు చేయువచ్చును. మనకు నేడు తగినంత బలము లేనన్న కారణము వల్లనే బ్రిటిషు ప్రభుత్వము ఎట్టి వాగ్దానముల నివ్వ నిరాకరించుచున్నది. అట్టి బలము చేకూర్చునది ఒక్క నిర్మాణ కార్యక్రమమే! "నేటిసంఘములో స్త్రీల నీచస్థితి ఇట్లు వర్ణించబడినది. "కుటుంబమా, హృదయముయొక్క దేశము. కుటుంబమునందు అన్యాయమున్న యెడల దేశమునందు న్యాయ మెట్లుండును! కుటుంబమునందు దాస్యమున్నయెడల దేశమునకు స్వాతంత్ర్యమెట్లుండును? గృహలక్ష్మియగు స్త్రీస్వాతంత్ర్యము అడుగంట చేయుటలోనే పురుషునియొక్క స్వార్థపరత్వము ప్రకటితమయినది. స్త్రీలు మనుష్యులనియు వికాసము పొందగల ఆత్మగలవారనియు మరచి వారిని బొమ్మలనెమాదిరి బనలన గృహములుగూడ బొమ్మరింద్లుగమారినవి. సంఘమును రెండు తెగలుగ విభజించి ఒక తెగను రెండవ తెగకు, నిరంతరము, దాస్యము సలుపునటుల చేయుట అన్యాయము. స్త్రీపురుషులకు కొన్నివిషయములలో భేదములుండిన వుండవచ్చును. కాని భేదము అసమానత్వము నిరూపించునా? పురుషులకు భేదములులేవా? జాతులకు జాతులకు భేదములులేవా? అంతమాత్రముచేత ఒకజాతివారు మరియొక జాతివారికన్న అధికులని అధికారము చెలాయించుట న్యాయమా! విద్యయందు మతమునందు సంఘములో స్త్రీ, పురుషుల దయా ధర్మభిక్షకు లోనయినది. యేనాడు స్త్రీకి, పురుషునితో బాటు సమానహక్కు, స్వాతంత్ర్యము లేదని, శాస్త్రములు, ధర్మములు, ఆచారములు సృష్టింపబడినవో, యేనాడు అర్ధాంగియని జెప్పబడు స్త్రీని ఆటవస్తువుగజేసి, భోగవస్తువుగ జేసి, ఇహపరములకు పురుషుడే, గతిగజేసి, యువిరియుక్తమనీతులని శాస్త్రకారులు, కవులు, స్వార్థమునకొరకు చిత్రించిరో ఆనాడే స్త్రీ సంఘము పతనమైనది. ఆనాడే పురుషుడు, పురుషునితోగూడ దేశము పరాధీనతజెందినది. భారతనారీమణులు ఒకప్పుడు, వేదాంతమునందు, జ్యోతిషమునందు, ఆయుర్వేదమునందు, ధనుర్వేదమునందు భక్తివైరాగ్యములందు ఇంతయేల, సమస్త సభంతరములలోను పురుషునితో బాటు సమానముగ, భారతీయసంస్కృత్యాదికలను ప్రపంచమునకు వ్యాపింపజేయ గలిగిరి. అట్టి మహోత్కృష్టమైన స్వాతంత్ర్య మనుభవించుచున్న భారత స్త్రీ సంఘము తారుమారైనది. స్త్రీస్వాతంత్ర్యమునకు పేరుగన్న హిందూదేశము నేడు స్త్రీ పరాధీనతకు అగ్రస్థానము వహించినది. మేల్కొనుడు. మేల్కొనుడు. ప్రతిజాతియొక్క స్వాతంత్ర్యము ఆజాతి స్త్రీమీదనే ఆధారపడియున్నదని మన మెరుంగవలెను. స్త్రీ ఆర్థిక, సాంఘిక, రాజకీయ జీవనమునందు పురుషునితోబాటు సమానత్వము బొందువరకు, కుటుంబముగాని, గృహముగాని పరిశుద్ధముకాజాలదు. అందు శాంతిసౌఖ్యము లుండజాలవని వేరుగ చెప్పనేల? మదరాసు రాష్ట్రములో విద్యాభివృద్ధి నితర దేశములతో పోల్చుచు నిట్లు చెప్పెను "ఇచ్చట విద్యావ్యాప్తికొరకు ప్రతి వత్సరము రెండుకోట్ల రూప్యములు ఖర్చు చేయుచున్నారు. ఇప్పటికి చదువు వచ్చినవారిసంఖ్య ౧౦౦కి ౮. అందు స్త్రీలు ౧. భారతదేశ ప్రభుత్వము పాశ్చాత్యుల హస్తగతమయిన ౧౫౦ సంవత్సరములలో విద్యావిషయమునందు ఇంత ముందుకు పోగలిగితివి. ౧౦౦ కి ౧౦౦మంది విద్యావంతులు గావలెనన్న యికనెంతకాలముపట్టునో ఊహింపుడు. రష్యాదేశము చూడుడు. ౧౫ వత్సరములనాడు అందు చదువుకొనిన వారి సంఖ్య ౧౦౦ కి ౩. నేడన్నదో ౧౦౦ కి ౯౦. ఇంతత్వరితముగ విద్యావ్యాప్తి నొందుటకు కారణమేమి! రష్యాయొక్క ప్రజాస్వామిక ప్రభుత్వకార్యదక్షతయే."

తుదకు "ఒక నిర్ణీతప్రణాళిక ననుసరించి నిర్బంధ విద్యావిధానమును అమలులోనికి తెచ్చిన ౧౫ వత్సరములలోనే మనము విద్యావంతులమయి, మనదేశస్వాతంత్ర్యము త్వరలో బడయ గలుగుదుమని నాకు పరిపూర్ణవిశ్వాసము గలదని" సూచించెను.

* * * *

ఆహ్వానసంఘాధ్యక్షురాలు శ్రీమతి కైప శేషమ్మగారు స్వాగతోపన్యాసములో ప్రస్తుత స్త్రీసమస్యలను పేర్కొనుచు, "స్త్రీ పునర్వివాహము. రజస్వలానంతరవివాహము. శారదా చట్టము, విడాకులచట్టము, సంతాననిరోధము. అనిరి, వీటిలో మొదటిమూడు స్త్రీలకనుకూలముగ జేరివవసుము, ఇక చర్చనీయాంశముగనున్న విడాకులచట్టము, సంతాననిరోధము. వీనినిగూర్చి ఇదమిత్థమని [illegible] తో పజూప నేనసమర్థురాలను గాను. సంఘసమష్టిశ్రేయమును, జాతియొక్క ఆరోగ్యమును, భ్రష్టిని, నిర్మలాంతఃకరణతో తామువీక్షించి భారతజాతియొక్క వికాసమును, పూర్వాపరసంబంధములను, లోకములో ఇతరఖండపరిస్థితులను సమగ్రదృష్టితో పరిశీలించి, తామీసమస్యల పరిష్కారమునకు గడంగుదురుగాకయని ప్రార్థించుచున్నాను. ఎట్టితీర్మానములనుగాని తొందరపాటుతో జేయకుందురుగాక" యని కోరెను.

ఆస్తిసంక్రమణముగూర్చి, "ఎవరికిగాని సొంతఆస్తి ఉండకూడదను చట్టము అంగీకరింపబడునెడల స్త్రీలకు ప్రత్యేకసమస్యయే యుండదు. అట్టి సామ్యధర్మ శాసనమేర్పడులోజు వచ్చువరకు ప్రస్తుతమున్న వారసత్వపుచట్టము స్త్రీలకు న్యాయముజరుగునట్లుగ మారవలసిన ఆగత్యముకలదు. మహమ్మదీయుల "లా" లో స్త్రీకి పురుషులతోపాటు పిత్రార్జితములో భాగముకలదు. మలయాళదేశములో స్త్రీయే యావత్పిత్రార్జితమునకు కారకురాలు. అటినీతిలో హిందూస్త్రీ తనసోదరునితోపాటు పిత్రార్జితమందు భాగముకోరుటలో ప్రకృతివైరుధ్యమేమియు లేదు. కావున, దీనికి అనుకూలమైనచట్టమును మనశాసనసభలు అచిరకాలములోనే నిర్మించగలవని ఆశించెదము." అని చెప్పెను.

* * * *

ప్రారంభోపన్యాసంకావిస్తూ మద్రాసు అసెంబ్లి కాంగ్రెసుసభ్యురాలైన శ్రీమతి జి. అమ్మన్న రాజా గారు పరదేశములతోపాటు అన్నిశాఖలలోను స్త్రీలు పురుషులతో సమాన ప్రతిపత్తిని అందవలసిందిగా ఉద్బోధించిరి.

శారదాచట్టం కఠినంగా అమలు జరుపవలెననీన్ని, స్త్రీలకు పురుషులతోబాటుఆస్తిలో సమానహక్కులివ్వబడేట్టుగాహిందూన్యాయశాస్త్రం మార్చవలసిందని పల్కిరి.

## రాజకీయ ఖైదీలను వదలుటకు మంత్రి పక్షము వారి ప్రతికూలత

మంత్రిపక్షమువారికిని మించుటకు తదితరపక్షములవారి సమ్మేళన యత్నము

సిమ్లా: జూన్ ౨౩

నేటిసాయంకాలము పంజాబు శాసనసభ మంత్రుల (యూనియనిస్టు) పక్షముగారు ప్రధానమంత్రియగు సర్ సికందర్ హయత్ ఖాను గారి అధ్యక్షతను సమావేశము జరిపిరి- సభకుపత్రికాప్రతినిధులను రానీయలేదు- రాజకీయ ఖైదీలవిషయమునుగూర్చియు, పంజాబు అసెంబ్లీ సభ్యులజీతములనుగూర్చియు, తదితర ముఖ్యవిషయములనుగూర్చియు నిర్ణయములు గావించబడినట్లున్నది. జరిగినచర్చలవిషయము అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరికి క్రిందివిధమున తెలిసినది- అసెంబ్లీసభ్యులజీతములు నెలకు ౨౦౦ రూపాయలకంటె యెక్కువయుండరాదని తీర్మానింపబడినట్లున్నది-

సాంఘిక కలహములు జరుగకుండ చేయుటకు రాజీసంఘములేర్పరుపవలెనని ప్రధానమంత్రిగావించిన సూచనపై తీవ్రముగా చర్చించిరట-

తరువాతశాసనసభలో ప్రతిపాదింపబడవలసిన తీర్మానములనుచర్చించిరి- తమ పార్టీవారిచే నోటీసివ్వబడిన మూడుతీర్మానముల శాసనసభచే వారుఅంగీకరింపజేయుటకు నిశ్చయించిరి- అవియేవన (౧) ఋణ పరిష్కారసంఘము ల సంఖ్యనుహెచ్చించుట [౨] పంచాయితీ శాసనమును అమలువిస్తరించుటకై పరీక్ష [౩] టీకామీవ్యవహారముల సంఖ్యనువిచారించి, వానికి ప్రతిక్రియ చేయుటకై ప్రతిరెవిన్యూ డివిజనులోను అనుభవముకల రెవిన్యూ ఆఫీసరును స్పెషల్ డ్యూటీలో నుంచుట—ఈ విషయము లకుసంబంధించినవి-

రాజకీయ ఖయిదీలనందరిని విడుదలచేయవలెననికోరు తీర్మానమువిషయమై తరువాతచర్చజరిగెను- తీర్మానమును ప్రతిఘటించుటకు పార్టీవారుతీర్మానించిరి- న్యాయ కార్యనిర్వాహకశాఖలను వేరుచేయవలెనను తీర్మానముపై పార్టీవారు చర్చజరిపి ప్రతిఘటించుటకు నిశ్చయించిరి-

### క్రొత్తప్రభుత్వ ప్రతికూలపక్షము యేర్పరుపబడుట

పంజాబుశాసనసభలో ప్రభుత్వ పక్షములన్నియుచేరి ఒకపక్షముగా చేరినవి దీనికార్యక్రమమునకు బాబాపు రెంమంది అంగీకారము తెలుపుచున్నారు- ఈపార్టీ కార్యక్రమము చమన్ లాల్ గారిచే తయారుచేయబడెను- ప్రభుత్వప్రతికూలపక్షము లన్నిటినుండియుయేర్పరుపబడిన ఒకఉపసంఘము సదరుకార్యక్రమము నామోదించెను- పంజాబునందలి పట్టణగ్రామప్రజలక్షేమమునకై గైకొనదగిన చర్యను పార్టీవారునిర్ణయించిరి- శాసనసభలో తమ పార్టీకి ఆధిక్యతకలుగునని ప్రభుత్వప్రతిపక్షవర్గ సభ్యులతలచుచున్నారు-

### వినాయకరావు సవర్కారుగారిపై కాంగ్రెసు వారల అగ్రహము

పూనా: జూన్ ౨౩

సవర్కారుగారు జూన్ ౨౫ వ తారీఖున పూనాకువచ్చునపుడు పౌరులువారికిసన్మానము జరుపదలచినసంగతి తెలిసినదే- ఆ సందర్భమున ఏర్పాట్లుచేయబడినవి- కాని కాంగ్రెసు వాదులు సన్మానములోతోడ్పడ నిరాకరించిరి- కాంగ్రెసువాదుల విషయమై మిరాజ్ లో వినసర్కారుగారుచెప్పిన మాటలకు అసమ్మతిదెలుపుటకుగాను వారిట్లునిర్ణయించుకొనిరి.

### గ్వాలియరు మహారాజు రథములాగుట

గ్వాలియరు: జూన్ ౨౫

శివపూరిలో గ్వాలియరుమహారాజు సర్ మాధవరావు సింధియాగారిజ్ఞాపకోత్సవము జరిగినది- ఉన్నతోద్యోగులుకూడ పాల్గొనిరి- కీర్తిశేషులైన మహారాజుఛాయాపటమును జెండా రథమునందుంచి. రథమూరేగించిరి- దారిపొడుగున మందుగుండుసామగ్రినికాల్చిరి- ఇప్పటిగ్వాలియరు మహారాజాగారు స్వయముగరథములాగిరి-

### కాంగ్రెసు కార్యకారిణీ సంఘసభ

వార్ధాలోజరుగబోవు కాంగ్రెస్ కార్యకారిణీసంఘసభకు కాంగ్రెస్ వారి ఆధిక్యముగలశాసనసభలుండు ఆరు రాష్ట్రములయందలి కాంగ్రెసుపక్ష నాయకులు ఆహ్వానింపబడిరి. డా॥ ఖాన్ సాహెబుగారును, శరత్చంద్రబోసుగారును ఆహ్వానింపబడిరి. జబ్బుగానుండుటచే సుభాష్ చంద్రబోసుగారు రారు.

### సరిహద్దులో యుద్ధము

౨౩జూను యుద్ధము ఆగిపోయినదనియు, శాంతిపరిస్థితు లేర్పడినవనియు క్వెట్టనుండి సమాచారము తెలిపినది. పైనా ప్రభుత్వమునకు చెందిన ఆరుయుద్ధవిమానములు ఆర్మాచెనుండి బయలుదేరినవి.

### కాంగ్రెసు ఆజ్ఞ వినని సభ్యులపై చర్య

అలహాబాదులో సంయుక్తరాష్ట్రములకాంగ్రెసు కార్యకారిణీసభ ౨౦జూను సాయంకాలముతో ముగిసినది.

రాష్ట్రీయ శాసనసభఎన్నికలు జరిగినపుడు కాంగ్రెసుఅభ్యర్థికి ప్రతికూలముగా పనిచేసినకారణమున బెరిలీ మ్యునిసిపలు సంఘసభ్యుడగు కృష్ణనారాయణకపూరు, కాళీచరణ అగర్వాలాజిల్లాబోర్డుఅధ్యక్షుడగు సయూరాంచతుర్వేదిగార్లపైని చర్య జరుపుటకొక తీర్మానము చేయబడెను. కపూరుగారు మ్యునిసిపలుసంఘసభ్యతకు రాజీనామానియ్యవలెను అనియును, అగర్వాలాగారిపేరును కాంగ్రెసువోటరుల పట్టికనుండి తొలగింపవలెననియును కాగా నేషనలుఉత్సవమునిమిత్తము బోర్డువారు ద్రవ్యమును వ్యయపరుపవలెననితీర్మానమునకు అనుకూలురసంఖ్యయును ప్రతికూలురసంఖ్యయును సమముగానున్నప్పుడు జిల్లాబోర్డు అధ్యక్షుడగు చతుర్వేదిగారు తాను కాంగ్రెసుసభ్యుడయ్యును తీర్మానమునకు అనుకూలముగా తనకాస్టింగు వోటునిచ్చి అదినెగ్గునట్లు చేసినందుకు అతడు జిల్లాబోర్డు సభ్యతకును అధ్యక్షతకునుగూడ రాజీనామా నియ్యవలెననియును కార్యసంఘమువారు తీర్మానించిరి.

పండిత జవహరులాలు నెహ్రూగారు కూడ సభకువచ్చి చర్చలలో పాల్గొనిరి.

ఉరుదుభాషలో వారపత్రికను ప్రకటించుటకు ధనమునొసగవలెనను తీర్మాన మామోదింపబడెను_ఒక ఇంగ్లీషు దినపత్రికను ప్రకటించుటనుగూర్చి చర్చింపబడెను.

### ఢిల్లీలో బిచ్చగాండ్రకు జీవనోపాధి

ఢిల్లీనగరమున భిక్షుకులసంఖ్య ఎక్కువగుచున్నది. వృద్ధులు, అంగవిహీనులు, రోగులుఅగు పేదవారు నగరమున గుంపులు గుంపులుగా చేరుచున్నారు. వినోదములునవారులుచేసి, ఇట్టివారికి నగరమునకొన్ని ప్రాంతములందు సైనికులకు నిర్మించు గుడిసెలమాదిరిని నిర్మింపవలెననియు, దినమునకురెండుసార్లు ఆహారముపెట్టుచుండవలెననియు పోలీసు సీనియరు సూపరింటెండెంటు జె.యస్. స్కాటుగారు ఢిల్లీ మునిసిపాలిటీవారికి తాము వ్రాసినలేఖలో సూచించిరి.

### క్రొత్తరాజ్యాంగ శాసనములో క్రొత్తపన్నుల భారము

వి-వి-గిరిగారు ౧౯జూనువారు పిఠాపురములో ఉపన్యసించుచు "క్రొత్తఇండియాఆక్టువల్ల రాష్ట్రాల రూపాయలపన్ను యెక్కువౌతుంది."అని చెప్పిరి-

### ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వారలకును వల్లభాయిపటేలుగారికిని భిన్నాభిప్రాయములు

బొంబాయి, జూన్ ౨౧

అసెంబ్లీఅనఁబడు భారతశాసన సభకు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అస్వస్థతవలన రాజీనామానీయగా, అస్థానమునకుటిం (ఆంధ్ర రాష్ట్ర)కాంగ్రెసుకార్యసంఘమువారు సత్యమూర్తిగారిని అభ్యర్థిగా నిలిపిరి. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు అధ్యక్షులగువల్లభాయిపటేలుగారు రాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారి సూచనను ఆమోదించకుండ మొసలికంటి తిరుమలరావుగారిని అభ్యర్థిగానిలుపునట్లు ప్రకటించిరి. తిరుమలరావుగారిని అభ్యర్థిగానిలుపుటను గురించి అసమ్మతిని తెలుపుటకు మద్రాసుఅసెంబ్లీసభ్యులు ౫గురును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘసభ్యులుఇద్దరును మరిపెక్కుమందియును సంతకములుచేసి వ్రాసియిచ్చినలేఖను డాక్టరు రంగయ్య, లక్ష్మీపతిగార్లు తమ మిత్రులనేకులుదయమున బొంబాయిలో సర్దారుపటేలుగారికిచ్చి సంగతులన్నిటిని తెలియజేసిరి. పటేలుగారు సావధానముగా నన్నివిషయములను వినిరిగాని తాము చేసిన నిర్ణయమును మార్చ వీలులేదని తెలిపిరి.

### ఇండ్లు కట్టుకొనుటకు శ్రేష్ఠమైన స్కీము

సొమ్ముకిస్తులప్రకారముకిరాయపద్ధతిగా చెల్లించిఇంటియొక్కయజమానికమ్ము.

ఈస్కీము హిందూసుహాజనుల ముందుట పెట్టబడుచున్నది. సికింద్రాబాదు హైద్రాబాదు మధ్యనగలశుభ్రమయిన శ్రేష్ఠమయిన స్థలములలో మీకోరకు ఇల్లుకట్టుకొనుడు.

ఈ స్కీమునందు నామమాత్రముగా చేరుటయేగాదు. తమయిష్టప్రకారము స్వంతఇల్లుకట్టుకొనవచ్చును. ఈప్రకారను ఇల్లు ఉచితముగా తయారగును. సొమ్ముకిస్తులప్రకారము చెల్లించుచు నచ్చినచో కొన్ని సంవత్సరములతరువాత ఇంటియొక్క యజమానిత్వము సిద్ధించును.

ఇంక కొద్దిమందిమాత్రమే చేరుటకుఅవకాశముగలదు. చేరదలచినవారు ఈక్రింది వారితో ఉదయము7నుండి10 గంటలవరకును సాయంత్రం 5నుండి 7గంటలవరకు సమక్షమునుమాట్లాడి వివరములు తెలుసుకొనవచ్చును. రావు

3566 మహబూబుపురా రోడ్డు,జాంబాగు

హైద్రాబాదు-దక్కన్

## మృతబంధువులనుండి సందేశము పొందు విధానము

విశాఖపట్నం: జూన్ ౨౦

కలకత్తా స్వర్గవిజ్ఞానస్థాపనకులగు శ్రీయుత పంద్రంగి కేశవరావు బి.ఎస్.సి.,బి.ఎల్. గారు హిందూరీడింగురూములో స్వర్గవిజ్ఞానము, మరణానంతర విశేషములగూర్చి ఉపన్యసించి, "శకులతలతో ప్రారంభమైనజీవోత్పత్తి మనుష్యులతో అంతమొందక అంతకంటె తేజోవంతముగు గురుశ్రేణిగా, అనంతముగా సూక్ష్మరూపముగ పెరిగి తెలియరానిభగవంతునిలో అంతమగుచున్నది." "గ్రామఫోనురికార్డుతో పాటలుపాడించునట్లే సూక్ష్మలోకముతోను, దేవలోకముతోను సంబంధముకలిసి వారిపూర్వకాలపుమాహాత్మ్యములను, విశేషములను ఇప్పుడు జీవించుమనకు ప్రత్యక్షస్మరణకలుగునట్లు పూనికతో పాటుపడిన సాధ్యమగును ఆంధ్రదేశములోఉన్నిచోట్లను ఈవిషయమై కృషిచేయుచున్నవారినందరిని కలియగలపి ప్రాతిబల్లమొదలగువానితో కృషివ్యాప్తి చేసినచో అనేకములగు క్రొత్తసంగతులు తెలియగలవు." అని తెల్పిరి. ప్రతిచోటనుమీడియముగ ఉపయోగించువారు లభింతురనియు వారిసంచారములో ఈ అభిలాషకలవారు వారినికలిసికొనినయెడలవారికి సలహాలనీయగలరనియు అపుడు ఏకగరము న కొనగరము ఈవిషయమైకృషిచేసి మృతజీవులనుండి సందేశములబడయవచ్చుననియు,అంగులకేతాము స్వర్గవిజ్ఞానపరిషత్తు స్థాపించితిమనియు, ఈపరిషత్తులో అయిదురూపాయలచందాయిచ్చిగాని, విరాళములొసగిగాని ఈ ఏకైక ఆంధ్రసంస్థను ప్రోత్సాహపరుపవలయుననియు తెల్పిరి.

—

## మదరాసు భూమిశిస్తు సవరణ అసంఘమువారి ఆలోచనలు

పండేపంటవలన వచ్చులాభములో శిస్తువాల్గవ పంతుకంటె ఎక్కువఉండకూడదనుసిద్ధాంతమును భూమిశిస్తు సవరణసంఘములో అనధికారసభ్యులు సమర్థించుచున్నటుల తెలియుచున్నది.

ఈపద్ధతిబర్మాలో ఆచరణయందువున్నది. భారతదేశమున తదితర ప్రాంతములలోగూడ ఈమాదిరిగలదు. మదరాసు రాష్ట్రమునమాత్రమే భూమిశిస్తుపండేపంటలవలన వచ్చు లాభములోసగమున్నది. నాల్గవవంతును మించియుండకూడదని పన్నువిధాన విచారణసంఘమువారు శిఫార్సుచేసిరి.

మెట్టూరు కెమికల్ ఇండస్ట్రియల్ కార్పొరేషన్ వారు కాస్టిక్ సోడా, బ్లీచింగుపౌడరు తయారుచేయదలచి, తమపరిశ్రమలకు ప్రత్యేకఛార్జివిధింపవలెనని ప్రభుత్వమునకువిన్నవించిరి [ఆంధ్ర]

—

## భోన్స్లే సైనిక కళాశాల ప్రారంభోత్సవము

నాశిక్: జూన్ ౨౧

భోన్స్లే సైనికపాఠశాల ప్రారంభోత్సవము నుజరుపుమి డాక్టరుకుర్తకోట శ్రీశంకరాచార్యులవారు "భారతదేశము చుట్టుప్రక్కలవారినుండి చిక్కులుకలుగకుండునటుల చేసికొనగలశక్తి సంపాదించునంతవరకు బ్రిటిషుప్రభుత్వము వారితోటి సంబంధమునువదలుకొనజాలను. ఎన్నాళ్లనుండియో ఉన్నకొరతను డాక్టరుమూంజిగారుతీర్చిరి. ఇందులకు కృతజ్ఞులము. సైనికవిద్యపట్ల అభిలాషగల హిందూయువకులకు తోడ్పడుఉద్దేశముతో ఈపాఠశాలను ఏర్పాటుచేసిరి" అని స్వాములవారు తమఉపన్యాససందర్భమున నుడివిరి.

—

## మహమ్మదీయులను కాంగ్రెసులో చేర్పయత్నించిన మునల్మానునికి నిషేధాజ్ఞ

—

ఢిల్లీ: జూను ౧౯

మౌలానా హుస్సేను అహమ్మదు గారు మొన్నటిరకు జమయతులులేమా హిందూకార్యనిర్వాహకసభ్యుడే గాక ముస్లిములీగు పార్లమెంటరీబోర్డుసభ్యులు అయియున్నారు. నిన్నవీరు తనపనికై యూపీకి ... ప్రభుత్వమువారిఅనుమతిలేనిది ఢిల్లీలో ప్రవేశింపరాదని ఛీఫుకమిషనరుగారు, ఆజ్ఞాపత్రమును ... నోటీసుపంపిరి

మౌలానాగారు గతవారము పతేపూరి మసీదులో మహమ్మదీయులను కాంగ్రెసులోచేర హెచ్చరించుచు ఉపన్యసించిరి.

—

## రైల్వేకూలీలకు ప్రావిడెంటు ఫండు

మదరాసు: జూను ౨౨

రైల్వేపనివాండ్రకు ప్రావిడెంటుఫండు విషయమై అఖిలభారతరైల్వే ... సంఘమువారు రైల్వేబోర్డుతో రాబోవునెలలో సంప్రదించెదరు.

ప్రస్తుతపద్ధతిననుసరించి రైల్వేలందు కూలీలనబడువారికి ప్రావిడెంటుఫండు సౌకర్యములేకున్నది. ఇతర పనివాండ్రయందుకూడా నూటికి మూడుపందివంతున మాత్రమే ప్రావిడెంటుఫండును పొందుచున్నారు. వీలనగా నెలకు రూ.౨౦కన్నను ఎక్కువజీతము తీసుకొనువారుమాత్రమే ప్రావిడెంటుఫండు సభ్యులైయున్నారు. సెలవులుమరియు యితర నిబంధనలకన్నను ప్రావిడెంటుఫండు విషయము పనివాండ్రకు ప్రస్తుతము ముఖ్యమైన విషయముగానున్నది. పనివాండ్రందరికి ప్రావిడెంటుఫండు నొసగవలసినయెడల సంవత్సరమునకు ౫౦ లక్షలరూపాయలయింకా ఎక్కువకావలసియుండునని రైల్వేబోర్డు తెలిపెను. (ఆంధ్ర)

—

## గవర్నరును చంపయత్నించినవానికి యూరోపులో చదువుకొనుట కనుమతి

—

బొంబాయి; జూన్ ౧౭:—

బెంగాలు గవర్నరును హత్యచేయ ప్రయత్నించిన రబీంద్రనాథ బెనర్జీ గారికి శిక్షవిధించిరి. తర్వాత శిక్షను యావజ్జీవద్వీపాంతరవాసశిక్షగ మార్చిరి. చదువుపూర్తిచేసుకొనుటకు యూరోపుకు వెళ్లుటకు ప్రభుత్వముగారు వీరికి అనుమతియొసంగిరి. బెనర్జీగారు ఇంజనీరింగుకోర్సు తీసుకొనదలచిరి. ఒకయూరోపియనువిద్యాంసులు వీరిపోషకులట. పోలీసుకాపలాతో వీరినిబొంబాయి చేర్చిరి.

—

## బెంగాలులో వ్యవసాయకళాశాల

బెంగాలులో వ్యవసాయవిద్యకై ఫస్టుగ్రేడు కళాశాలను ఏర్పాటుచేయు విషయమునుగూర్చి వ్యవసాయ, పరిశ్రమలమంత్రులు ఆలోచించుచున్నారు.

—

## భారతదేశపు సరిహద్దులో మనుష్యుల నెత్తుకొనపోవుట

పెష్వా; జూన్ ౧౭:—

ఉమర్ ఉటార్ ఖల్ గ్రామమునుండి కొందజాతులవారు ముగ్గురుబాలికలను అపహరించిరి. బాలికల ఆప్తబంధువులు బాలికలున్నప్రాంతమునకువెళ్లి కొండజాతులవారితో సంప్రదించి, బాలికలనువిడిపించి రు ౪౦౦౧ లిచ్చుటకుఒప్పుకొనిరి. బాలికలబంధువులు 3000 సమకూర్చిరి. మిగతా వేయరూపాయలకు వేరు ఏర్పాటుచేయుదురు. ఈ వేయిరూపాయలను ఒకరినివాసిమిాగాతుంచి, డబ్బుతిరిగ్వితప్పెద ... బాలికలను రక్షించుటకు. వేరేవిధముల నష్టపడినవారికి నష్టపరిహార మొసంగుటకు చందాలొసంగవలెనని ప్రజలకువిన్నపము ప్రకటించిరి. సేవాసమితి వాలంటీర్లు ఇంటిఇంటికిపోయి చందాలను వసూలు చేయుచున్నారు.

—

# ఇష్టాగోష్ఠి

—ఆంగీరసుడు

## ఆంధ్రప్రజాసంస్థలు

ఆంధ్రరాష్ట్రములో ప్రజాసంస్థలవృద్ధి, వాటికి ప్రజాదరణచాల నిరుత్సాహముగనున్నది. ఇప్పటికి యిరువదియైదు సంవత్సరములక్రితము శ్రీజయంతి రామయ్యపంతులుగారి నాయకత్వమున ఆంధ్రసాహిత్యపరిషత్తు కీ॥శే॥ సర్.బి.ఎన్. శర్మగారి అధ్యక్షతక్రింద ఆంధ్రమహాసభ స్థాపింపబడినది. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము, ఆంధ్రాభ్యుదయముపేరిట ఆంధ్రమహాసభ ఒకటిన్నరకోటి బ్రిటిషుఆంధ్రులను కదిలించివేసెను. కాని యీఆంధ్రోద్యమ తీవ్రత అయిదు సంవత్సరములుమాత్రమే నిలచినది, ౧౯౧౩ లో ప్రత్యేకరాష్ట్రియకాంగ్రెసు సంఘమేర్పడగానే ఆంధ్రులు ఆంధ్రోద్యమమునుగురించి మరచి భారత స్వరాజ్యాందోళనములో పడిరి. ౧౯౨౧ వరకు రాష్ట్రకాంగ్రెసు మహాసభతోనే ఆంధ్రమహాసభ జరుగుచుండెడిది. ౧౯౩౧ నుండి నేటివరకు తత్పూర్వముకన్న విశేషముగ ఆంధ్రమహాసభ "అదృశ్యముకాలేదు" అనిపించునట్లు నడుపబడుచున్నది, ప్రధానకార్యదర్శి సుసర్ల శ్రీరామనృసింహముగారని "ఆంధ్రమహాసభ" యని పిలచు సితికివచ్చినది. కాంగ్రెసు పక్షీయులు వారిస్వరాజ్యాందోళనతోనే సరిపుచ్చుకొనుచున్నారుగాని ఆంధ్రమహాసభావిషయములపై శ్రద్ధతీసికొనుటలేదు.

జస్టిసుపార్టీవారు వారిస్వార్థముకొరకు పెనగులాడు చేసరిపోవుచున్నదేకాని ఆంధ్రసమస్యలు వారిచెవినిబడవు. పైగావ్యక్తులు బొబ్బిలిరాజా, సర్ కూర్మాగార్లు ఆంధ్రమహాసభకు పెత్తనమువహించి ఆంధ్రరాష్ట్ర మక్కరలేదనుచు మోసముచేసిరి. పీపిల్సుపార్టీవారు యింతవరకు ఆంధ్రరాష్ట్ర శబ్దము నేర్చుకొనలేదు. ఆంధ్రస్వరాజ్యపార్టీయనువారు ఆంధ్రరాష్ట్ర సంపాదనమునుగురించి హడావిడిచేయుటయేగాని క్రియాభాగము లేదు. కనుకనే మహాసభ, ఆంధ్రమహాజనులయొక్కయు రాజకీయపక్షములయొక్కయు, నాయకులయొక్కయు తోడ్పాటు లేక నామమాత్రమై పోయినది,

## సాహిత్యపరిషత్తు

ఇంక ఆంధ్రసాహిత్య పరిషత్తుస్థితియైననూ అంత ప్రోత్సాహకరముగలేదు. ఆదేమివిచిత్రమోకాని ఆంధ్రమహాజనకోటియొక్క దృష్టిని సాహిత్య పరిషత్తుపై ప్రసరించియుండలేదు. అంటే ఆంధ్రులకు రాజకీయములందున్న అభిమానము సాహిత్యాదులపైన తక్కువన్నమాట. ఇట్లనుటచేత తెలుగువారిలో వందలాదివేలాది సాహిత్యపరులు లేరనికాదు. ఆంధ్రమహాసభ అర్థరాజకీయ (Quasi Political) సంస్థప్రజాసంస్థలలో ఆంధ్రమహాసభ మాతృకయనిపించుకొనుచున్నది. కర్నాటకదేశములో అట్లుకాదు. వారికి కర్నాటకమహాసభ యంటూలేదు. కర్నాటకసాహిత్య పరిషత్తేవారి మహాసభ రాష్ట్రీయకాంగ్రెసుసంఘమున్నది.

ప్రతికర్నాటకునకును కర్నాటకసాహిత్య పరిషత్తుఅనిన చాలగౌరవము. ఆదేశములో రాజకీయనాయకులుకూడ పరిషత్తుపై విశ్వాసముంచెదరు. బెంగుళూరులో పరిషత్తునకు ఏబదివేలు వ్యయపరచి చక్కటిభవనమును నిర్మించిరి. కర్నాటకపరిషత్తు సర్వతోముఖమైన అభివృద్ధిలోనున్నది ఆంధ్రసాహిత్యపరిషత్తు ఎదుగుబొదుగు లేక ఆకాకినాడనగర పిఠాపురంమహారాజాగారి తాలూకు పాతయింట్లో రామయ్యపంతులుగారి ఆధ్వర్యముననే నడచుచున్నది. పిఠాపురంవారు "సూర్యారాయనిఘంటు"ను పూర్తిచేయించుచున్నారు. పరిషత్పత్రిక నడచుచున్నది. పరిషత్తునకు ఏదోవిధముగ కాలక్షేపమగుచున్ననూ ఆంధ్రప్రజాకోటిని ఎక్కువగానాకర్షించియుండలేదు. వ్యావహారిక భాషావాదులు యీపరిషన్నాక్రమించెదరేమోయని పంతులుగారి భయము, గ్రంథాలయమేకాని నవ్యసాహిత్య పరిషత్తువారైననూ ఏపెద్దకార్యక్రమముతోనూ పనిచేయుటలేదు. ఆంధ్రగ్రంథములన్నియు విధిగాఒకచోట లభించునను ధైర్యములేదు. ఒక కేంద్ర గ్రంథవిక్రయశాలయైననూ కనబడదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఆంధ్రసరస్వతిని ఎట్లుపూజించుచున్నది తెలియుచునేయున్నది—ఆంధ్రభాషాపరీక్షలైననూ ఎచ్చటాకనబడవు. ఆంధ్రులువారి భాషవిషయములోను సంస్థలఅభివృద్ధినిగురించి యీవిధముగనున్నారు.

* * *

## భారతరాజకీయములు

ఇంగ్లీషువారి రాజకీయహృదయమును కనిపెట్టుటచాలకష్టము. ఒక్కొక్క సందర్భములో ఒక్కొక్కప్రకటన. ఒకప్రకటనకు మరొకదానికి శుద్ధవ్యతిరేకము కావచ్చును. మళ్లీఅభిప్రాయములను మార్చుకొనుట చూడండి. అంతకుపూర్వంమాట యటుంచి పట్టాభిషేకమువారమున్నదనగా జట్లండుప్రభువు బహుతియ్యటి మాటలను చెప్పి అరచేతిలో స్వరాజ్యమున్నదనెను. దానిపై అత్యాశాపరులగు రాజగోపాలాచారి మున్నగువారలు గాంధిగారిని బుజ్జగించి మెత్తటిమాటలతో మెట్టుదింపించి అభిప్రాయమిప్పించిరి. అందుమీదజట్లండు, అక్సుఫర్డులో తనపూర్వపు ఉపన్యాసమునకు వ్యతిరేకారములనుచూపించెను. ఇంగ్లండులో ఛాంబర్లేను మంత్రివర్గములో ఏమార్పువిధానము వచ్చెనో, కాని సహాయకార్యదర్శి స్టాన్లీప్రభువుతిరిగి సుముఖతజూపుచు మాట్లాడెను. ఈనెల ౨౨ తేదీని వైస్రాయిగారి ప్రకటనయున్నదట. ఈ రాజకీయతమాషాలు ఆశ్చర్యమును కలిగించుచున్నవి— ఇపుడువేసిన క్రొత్తఎత్తులో బహుశః కాంగ్రెసువారిని మంత్రివర్గములోనికిరప్పించి పరిపాలనమున్నదిన బాగుండునని తోచియుండవచ్చును— విశ్వాసరాహిత్య తీర్మానముబెట్టి కాంగ్రెసువారు నెగ్గగనే శాసనసభలను రద్దుచేయుసిర మంత్రివర్గముల నేర్పరచుటకన్న యింకాలోపలికిరప్పించితరిమివేయుటచేకారణము లెక్కువ కల్పించవచ్చునని కొనిరికాబోలు— గవర్నమెంటువారికి గిల్లికజ్జాపెట్టుట అతిసులువు— ఇది పులిమేకసామెతవలె నుండును— కాంగ్రెసువారిది ఉత్తరధ్రువము— గవర్నమెంటుది దక్షిణధ్రువము— గాన సుఖమైనకాంగ్రెసుమంత్రివర్గము సాగుటకు వీల్లుచాలతక్కువ—

* * *

## మహారాష్ట్రమహాసభ

నిజాంరాష్ట్రసభలో రామచంద్రనాయకుగారు సభాత్రయ సమ్మేళనాదర్శనమును సూచించిరి— ఇదిఎంతవరకు సాధ్యమో అనుసరణీయమో యూరమూలోచింపవలెను— ఒకనూతన రాగానే చంకలెగరేసి సరేయనరాదు— మూడును వేరువేరుభాషాప్రాంతములు— ఎవరిసాంప్రదాయములువారివి— ఎవరివ్యక్తిత్వమువారిది— జనసామాన్యములో ఒకరిభాష యింకొకరికి తెలియదు— సభాత్రయసమ్మేళనములో అమూడుభాషలను ఎవరిమనసులో వాపుంచుకొని ఉర్దూలో వ్యవహరింపవలెను— ఉర్దూనుపయోగించుట రాజభాషగాన మంచిదేకాని స్వభాషావ్యక్తిత్వమేది? అదియునుంగాక సభాయాజమాన్యతలోకూడ మాఆంధ్రులనియు, మామహారాష్ట్రులనియు, మాకర్నాటకులనియు పోటీలురావచ్చును— ఒక్కొక్క సమయమున ఆవివాదలుతీవ్రమై సమ్మేళనమునుండి విడిపోవుటకూడ తటస్థింపవచ్చును— మదరాసురాజధానిలో ఆంధ్రతమిళ కర్నాటకులమధ్య యిట్టిపోటీలుయుండుటవలన యింతగా చెప్పవలసివచ్చినది— కనుక సర్వజనులుమహాసభలలోసాల్గొని చర్చించుటకువీలైన యిప్పటిప్రాంతీయమహాసభలను ఎంతమాత్రము మార్చక స్థాయిసంఘములనుండి ఒక్కొక్కదానినుండి అయిదుగురనో లేక పదిమందినోతీసికొని నిజాంరాష్ట్రీయ కేంద్రసంఘముగా నేర్పరచుట యుత్తమపద్ధతి— రామచంద్రనాయకుగారి ప్రతిపాదనను దీర్ఘముగయోచించినచో మహాసభాత్రయ సమ్మేళనము అంత కార్యకారికాదని తోచకమానదు—



౧౪ వ పేజీ తరువాయి

పైపెచ్చు రెడ్డిగారు విశ్వవిద్యాలయ భాండాగారమునయున్న సామ్యవాద గ్రంథములనెల్ల ఒకచో చేర్చి విద్యార్థులకుగాని, ఆచార్యులకుగాని అందుబాటులో లేకయున్నట్లు కట్టడి చేసినట్లు తెలియుచున్నది. గుంటడాయిదాచిన పెండ్లియాగదన్నట్లు వీరు సామ్యవాదవాఙ్మయమును దాచిన సామ్యవాద ప్రచారమాగదని తెలుసుకోలేనంతటివెర్రులా? మైసూరురాష్ట్రమున నున్నప్పుడు బహుస్వతంత్రులని పేర్పడసిన వీరు నేడిటులపరివర్తనమందుట కాశ్చర్యము కలుగుచున్నది. నేను శ్రీయుత రెడ్డిగారిని విశ్వవిద్యాలయసభ్యులను మన ప్రక్కను హైదరాబాదు నవాబు ఉర్దూభాషలోనికి ప్రపంచములోని విఖ్యాతగ్రంథములనెల్ల తర్జుమా చేయించి ఉస్మానియా విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథములుగనిర్ణయించుట గమనించకోరెదను. విద్యార్థులకుయథార్థమైన విద్యనేర్పి సత్పౌరులుగ భాషాసేవకులుగ దేశభక్తులుగతయారుచేయు విద్యాలయముల కాంధ్రదేశమే చెప్పతగినదను ప్రతిష్ఠకొరకులు కావలసినదిగా హెచ్చరించుచున్నాను.

## తుంగభద్ర ప్రాజెక్టు

మనరాజధానిలో ఇంకను సాగుచేయదగిన భూమి, పదమూడుకోట్ల పదహారులక్షల నాల్గువేలయెకరములుగలదు. దీనినెల్ల భూములులేనివారికి సహకారపద్ధతిని సేద్యమునకిచ్చిన నిరుద్యోగసమస్య నానంతటనదివశించదా? సారవంతమైన రాయలసీమకరవుల కాటపట్టయినది. తుంగభద్రప్రాజెక్టును ఇంకా ఇతర పల్లపుసాగు సౌకర్యములను చేసిన ప్రజలుకరవులపాలుకారు. ప్రభుత్వమువారు ఆలోచనతోడను. అంచనాలతోడను కాలముపుచ్చుటతప్ప కార్యరంగమునకు దిగుసూచనలు కానరాకున్నవి. నూతన శాసనసభాసభ్యులైనను తగినంతశ్రద్ధచూపి వెంటనే తుంగభద్రప్రాజెక్టు నిర్మాణమునకు కారకులగుదురుగాక.

## ఆంధ్రరాష్ట్రము

కాంగ్రెసువారు రాష్ట్ర పరిపాలనయందు బాధ్యత! వహించుటయనునది సంభవించునో లేదో! ఏదయేట్లున్నను రాజధానిలోని స్వతస్సిద్ధమైనయిక్కట్లు కొన్నిగలవు భాషా ప్రయుక్తరాష్ట్రములు లేకపోవుట వాటియందొకటిమిగుల ప్రాముఖ్యమైనది మనరాజధాని యెన్నటివరకు అయిదుభాషలు మాట్లాడువారితో కూడియున్నది. ఓఢ్రులను విడదీసిరి. ఇంక అరవలు,కన్నడులు, మళయాళులు మనము కలిసియున్నాము. తుంగభద్రాప్రాజెక్టుఅని మనముఅంటే, మెట్టూరుప్రాజెక్టుఅని వారంటారు. ఏ విషయమువచ్చినా అరవలకునుమనకును కొంతపోటీ లేకపోలేదు. ఆంధ్రులు ప్రత్యేకరాజధానిలో యుండుటకుఆశ్చర్యలు. ౧౯౧౩నుండి యీఆందోళనవచ్చుచున్నను, సహాయనిరాకరణోద్యమమువలన దీనికికొంత అభ్యంతరముకల్గినది. అయుద్యమములోనె కాంగ్రెసువారు భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణమును గ్రహించి మనకువేరే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము నేర్పాటుచేసిరి. సైమన్ మిషన్ వచ్చినప్పుడు ఆంధ్రులు ఏకగ్రీవముగా బహిష్కరించుటవల్లను ఓఢ్రులు బహిష్కరించనందువల్లను వారికి ప్రత్యేకరాష్ట్రమిచ్చుటకును మనకివ్వకుండుటకును వారునిశ్చయించుకొనిరి. ఇప్పుడు ప్రసక్తమగుచున్న మనము యత్నింపవలసినది ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము. దీనియొక్క ఆవశ్యకతను గూర్చిగాని అర్హతనుగురించిగాని ప్రయోజనముగురించిగాని సాధ్యతనుగురించిగాని యెవరికిని యెట్టిసందేహమును లేదు. దీనినిగూర్చి అవకాశము చేకూరినవెంటనే శాసనసభలోను బయటనుఆందోళనజరిపి అచిరకాలములో మనము మనరాష్ట్రమును విడదీసుకుంటేనే తప్ప మనఅభివృద్ధికి అనేకమైన ఇబ్బందులుకలుగును. కాబట్టియీవిషయమై యెంతమాత్రము ఉపేక్షచేయక ఆంధ్రులు తీవ్రమైన ప్రయత్నములను సల్పెదరుగాక. శాసనసభానాయకులును కాంగ్రెసు ప్రముఖులును అయిన శ్రీమాన్ రాజగోపాలాచార్యులుగారు మన ఉద్యమమునకు ఎంతయుసుముఖులని మనకు తెలియును. వారియొక్క తోడ్పాటుతో మనకు అచిరకాలములోనే జయముకల్గుననుటకు సందేహములేదు.

## రాష్ట్రాదాయము

భూమిశిస్తుల తగ్గింపువలనను, మద్యపాననిషేధమువలనను రాష్ట్రాదాయముపూర్తిగా తగ్గగలదు. దీనికి ప్రత్యామ్నాయముగ కొంతవరకు ఆదాయమువృద్ధిచేయుటయు ఖర్చులతగ్గించుటయు జరుగవలసినపని. ఆదాయాభివృద్ధి క్రమమైనరాబడిపన్ను, కష్టమ్సు, ఎక్సయిజు, ఉప్పు, పంచదార, నిప్పుపుల్లల పన్నులు అఖిలభారత ప్రభుత్వస్వాధీనమునయున్నవి. ఇక రాష్ట్రప్రభుత్వము చేయదగినది పైనొకచోట నేను చెప్పినట్లు రు.౫౦౦కు పైబడ్డ ఉద్యోగీయులు ఐచ్ఛికముగాజీతమును తగ్గించుకొనుట, అభివృద్ధికిఅవకాశముగల ఇన్ కంటాక్సునుండి కొంతభాగము భారతప్రభుత్వమునుండి రాష్ట్రప్రభుత్వములుతీసుకొనుట, ప్రజాశాఖనిర్వహణకు అప్పులజేసి అప్పులనుతీర్చుటకుగాని, గుర్రపుపందెములు క్లబ్బులుమొదలగు ధనవంతుల ఉబుసుపోకకు ఉపయోగపడువాటిపై హెచ్చుపన్నులవువేయుట, సేనను భారతీయమయమొనర్చుటవల్ల వ్యయముతగ్గించుట, ఉప్పు, అగ్గిపెట్టె, ఎలక్ట్రిసిటీ మొదలైనపరిశ్రమలను ప్రభుత్వమే నిర్వహించి లాభములనెల్ల రాష్ట్రమునకే చెందునట్లుచేయుట,—ఈ సంస్కరణములవలన రాష్ట్రాదాయము వృద్ధినొందుట కవకాశముగలదు.

---






---

The best medium for reaching 7 million Andhras, of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రము ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రులలో ... గోలకొండపత్రికలో ప్రకటనము

**Vol. 12.** | **Mondy 28—6—1937** | **No. 15**


## ౧౭వ ఆంధ్ర రాష్ట్రీయ సభలో ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రశంస

అధ్యక్షులు శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్యగారి యుపన్యాసమునుండి కొన్ని భాగములు

నంద్యాలలో జరిగిన ౧౭వ ఆంధ్రరాష్ట్రీయ మహాసభకధ్యక్షత వహించి గొట్టిపాటి బ్రహ్మయ్యగారుఇచ్చిన ఉపన్యాసమునుండికొన్ని భాగములు క్రింద ప్రకటించబడు చున్నవి.

ప్రజలస్వత్వములకై కాంగ్రెసు వాదులు ప్రభుత్వముతో పోరాడుచున్నను, ఈయవకాశమును తమ స్వార్థమునకై వినియోగించుకున్న సర్ కూర్మావెంకటరెడ్డినాయుడుగారి నడుమంతరపు మంత్రివర్గమువారిని మన మెరుగని వారము కాము. తల్లిదాస్యమును గమనించక, భోగములనోలలాడుచుండు పుత్రుడు పుత్రుడు కాడు. తల్లికడుపుచెడబుట్టినశత్రువేయగును. మనకూర్మాప్రభృతులచర్యలు మనకు క్రొత్తవిగావు—వెనుకనొకసారి మంత్రిగానున్నపుడు గాంధిగారిస్వరాజ్యనిర్వచనము గోచిపాతస్వరాజ్యమని నిందించిన మహాజ్ఞానియీతడు. అట్టివీరినుండి హెచ్చుకాశ్యతా నిర్వహణఆశించుట మనవెర్రితనమేయగును. సర్వకాలసర్వావస్థలయందును నా జానెడుపొట్టకును శ్రీరామరక్షయనెడు ఈబృందమునకు స్వార్థమెప్పుడువదలునో? వీరు ప్రజలనాకర్షించుటకై వివిధప్రాంతములపర్యటనమొనర్చి ప్రభుత్వవందిమాగధబృందములలో ఏవోవెర్రిమొర్రిపత్రికములతో గారడీలుచేయజూచుచున్నారు. కాని ప్రజలు వీరిమోసములోబడకుందురుగాక! కాంగ్రెసువారి పార్లమెంటరీ కార్యక్రమములోని విషయములనేవీరు సేకరించి ప్రజలకేవోమేలుచేయనున్నట్లు వీరుప్రకటించు ప్రణాళిక యొక్క యథార్థస్వరూపమును ప్రజలకువచ్చజెప్పి కాంగ్రెసుయొక్క—బలముపైననే ప్రజలయొక్క—లాభములాధారపడియున్నను సంగతి ప్రచారమొనర్పవలసియున్నది.

### కొత్తపట్నం దౌర్జన్యము

నేడుయువకులకు ఆవసరమైనరాజకీయవిద్యనొసగుటకై యువజనసామ్యవాద సంస్థలతరఫున మిత్రుడు కామేశ్వరరావుగారిచే నడుపబడుచున్న కొత్తపట్టణపు రాజకీయపాఠశాలను నేనుచూచితిని. ఉపన్యాసములవింటిని— దౌర్జన్యమునుప్రోత్సహించు, ప్రపంచశాంతిని భంగపరచుమారణహోమము లేమియు అక్కడచేయబడలేదని కచ్చితముగచెప్పగలను—ఈపాఠశాలలో తామునిత్యముహాజరైయుండవలెననిపోలీసువారుకోరుటకుగలఆధారమేమి? సహజముగవారికిగలపిరికితనము, అనుమానము లేదా? దేశమునగలప్రతిపాఠశాలకును హాజరగుదురా? వీరిఅనుమానహృదయములను, ఆత్మగౌరవమును న్యాయస్వత్వములను బలిపెట్టనిరాకరించినసత్యాగ్రహులకు లాటీపోట్లును దెబ్బలును, స్త్రీలకుసహితము బండబూతులు, సహించరానిఅమర్యాదలు, దీనియథార్థమును తెలుసుకొనుటకువెళ్లినపెద్దలకు గుద్దులు, త్రోపులు, వీటిపైఅబద్ధప్రకేసులు, దీనిపైజరుగు అందోళనకు అబద్ధపుస్టేటుమెంట్లు,—ఇది నేటి రాష్ట్రస్వాతంత్ర్యము! నడుమంత్రపు మంత్రాంగమువారిపాలనాస్వరూపము! శాసనోల్లంఘనము నాటిపోలీసురాజ్యమునకును నేటి పాలనకును భేదమేమి?

### కాంగ్రెసు రైతులు

౧౯౨౦ నుండి కాంగ్రెసుఉద్యమము గ్రామములలోనికిప్రాకి రైతులనుతేనమూలబలము గచేసుకొనినది. కానికాంగ్రెసుతనసర్వశక్తులను స్వరాజ్యసంపాదనకై కేంద్రీకరించినకారణమున కార్మికకర్షకుల కష్టనివారణకై ప్రేడుయూనియనులు, రైతుసంఘములఆవశ్యకత తప్పనిసరిఅయెను—కొంతమందియీసంస్థలు కాంగ్రెసుతోపాటుగా సాగించుటకేర్పడినవనుచున్నారు—నాకుతెలిసినంతవరకు ఈసంఘములెల్లకాంగ్రెసుపెత్తనమునంగీకరించునవే.

కాంగ్రెసు నేడుపార్లమెంటరీ కార్యక్రమమును చేతబట్టినకారణమున, రయితులకు కార్మికులకు కావలసినశాసననిర్మాణమునకుగడంగి వారలహక్కులరక్షించగలసంస్థ కాంగ్రెసేయను భావమును సంశయగ్రస్తులకు సహితము వెల్లడి చేయగలదని విశ్వసించుచున్నాను.

కాంగ్రెసుశాసనసభ్యులెల్లరు శ్రద్ధగా రైతుసమస్యలనెల్లఅవగాహనము చేసికొని, ప్రస్తుతము భూమిపైవసూలు చేయబడుచున్నపన్ను రద్దుచేయబడుచున్నట్లును, భూమిపైవచ్చుఆదాయమునకు౫౦౦లకుమించినప్పుడు క్రమానుగతముగ ఆదాయపుపన్ను విధించినట్లును, ఈపన్నువిధించుటను అన్నివర్గములకుఒకేరీతిని పన్ను నిర్ణయించునట్లునుచూడవలయును—మాగాణికి నీటిసరఫరాలపై యింకిరుగరా—౫౧ వడ్డీగిట్టునట్లు తీరువవసూలుచేయుట మిగులఅక్రమము. నూటికిపది—పొప్పునవడ్డీగిట్టునట్లుమాత్రమే నీటితీరువ విధింపవలయును. క్రొత్తగామాగాణిచేయు భూములపై నజరానాలు వసూలు చేయబడరాదు.

### రైతుల ఋణగ్రస్తత

రైతులఆదాయము తలకరొకటికి రూ—౧—౮ అయియుండ రైతు చెల్లించవలసిన ఋణము రు ౦—౫—౬ అయియున్నది— యీఋణభారమునుండి రైతువిముక్తి కావలసియున్నది— మారకపుగారడీవల్లను చెలామణినుండి౧౧౬కోట్లు కరెన్సీతగ్గించుటవల్లను ధాన్యాదులధర మందగించుటయు. భూములకుసరియైనయెరువులువేయ లేనిస్థితియగుటచే పంటతక్కువపండుటయు, ఆపంటకుసరియైనధరరాకుండుటయు జరుగుచున్నది: ప్రస్తుతము రైతు చెల్లించవలసినఋణము మనరాజధానిలో౨౦౦కోట్లు—౧౯౨౯ కు పూర్వము భూములధరలకును నేటిధరలకునుగల వ్యత్యాసమునుబట్టి అసలుమొత్తమునుతగ్గించి వడ్డీ సం॥ ౧కి రు౩/-చొప్పునలెంచజావేసి ఆమొత్తమును ప్రభుత్వమే నూతనబ్యాంకులద్వారా కనీసము౪సం॥ హాయిదాలపైనూటికిరు౩/.లకుఎక్కువకానివడ్డీపై అప్పునిప్పించుట ప్రథమమునజరుగవలసియున్నది_ప్రతిసంవత్సరమువ్యవసాయ ఖర్చులకై కావలసిన పెట్టుబడికిసహితము రైతువడ్డీవ్యాపారిపద్దకువెళ్లనక్కరలేకుండ ఈ బ్యాంకులనుండియే రు౩-వడ్డీకేఅప్పుపొందునట్లుచేయవలసియున్నది_ధనవంతులు బిడలను పీల్చిపిప్పిచేయుఇట్టివడ్డీవ్యాపారమును చేయరాదనుఅంకు ప్రభుత్వమునుండి రావచ్చును. అయితే యీధనమంతయు ప్రభుత్వమే అప్పుగాతీసికొని పైబ్యాంకుల అధీనమున నుంచవలెను.

ఋణగ్రస్తులగురైతులకు పైసదుపాయములు జరుగునంతవరకు పాతబాకీలు వసూళ్ళకై యెట్టిఅములుజరుపరాదని మారిటోరియం మంజూరుచేయవలసిన అగత్యముగలదు. ఇట్టిచట్టము ప్రభుత్వముచేయనిరాకరించినచో కొలదికాలములో కష్టపడి వ్యవసాయముచేయు రైతునుండి భూమిసోమరియగు వడ్డీవ్యాపారిపరమై తక్కువవంటనిచ్చునదిగమారును— అప్పటిదేశస్థితినేడుబట్టకై పాశ్చాత్య దేశములవైపు ఎదురుచూచుచున్నట్లు తిండికిసహితము పరాయిదేశములకే దృష్టి నిగుడ్చవలసినస్థితి యేర్పడును.

### జమీందారీ పద్ధతి

ప్రభుత్వమువారుపర్మనెంటు సెటిల్‌మెంటు అనుపేర ఒకజమీందారీవర్గమునుసృష్టించి, తమప్రభుత్వము సుస్థిరముగానుండుటకుగాను ఈ జమీందార్లను మూలస్తంభములుగా నుంచుకొన్నారు: వీరుపర్మనెంటుసెటిలుమెంటు నాటికంటె తొమ్మిదిరెట్లుఆదాయమును హెచ్చుచేసుకని, రయితులనుండి జబర్దస్తీగా దయాలేశము లేనికటికహృదయముతో పన్నులగుంజుకొనుచు, భోగపరాయణులై, మనకును, మనపూర్వులకును, పవిత్రవంతమైనమనజన్మభూమికిని, అపయశస్సును కలుగజేయుచున్నారు—ప్రజలు పన్నులరూపమున చెల్లించుధనమును వీరు దుబారావ్యయమొనర్చునది ౫౦౦కోట్లు.

వీరి అవినీతికార్యములకు దోడు, మాంటుఫర్డు సంస్కరణలనాటినుండి, వీరుధనపుసంచులతో రాజకీయరంగమును కలుషితమొనర్చి, వోటును డబ్బుపెట్టికొని, ప్రజలజన్మహక్కులను సక్రమముగ చలాయించుకొనీక అవినీతులనుచేసి ప్రజలస్థానములనలంకరించి, తమస్థానములను బలపరచుకొని. తమస్వార్థమునకై దేశ ప్రయోజనములనెల్ల బలిపెట్టిరి. వీరికపటనటనలెల్ల గమనించిన ప్రజలుకడచినయెన్నికలలో దాదాపు అందరుజమీందార్లకును గుణపాఠములనేర్పిరి. ఇప్పుడైనను వీరుప్రభుత్వమువారి అండజూచుకొని ప్రజలనుహింసించి దెబ్బదిరూపాయలవరకు ఎకరమునకుపన్ను వేసి. పట్టాముచ్చిలికాలు విడుదలకైతోట్లఅములులో పెట్టక ఎపుడో పాలముఅమ్ముకొనినవానినుండిపన్ను వసూలుచేసి, ౧౯౫౧ నాటి ఎప్పపార్టీడిక్రీవోటు ఇవ్వలేదని అమలుపర్చుచూ, విధేయులు, అవిధేయులు, అనిరెండువర్గములుగా రైతులను విభజించి ఒకరినిఆదరించుటయు, ఒకరినిహింసించుటయు అనుకృత్రిమసిద్ధాంతమును వదలివేసి, ప్రజలతోరాజీపడి తమకుశాంతిని, ప్రజలకుసౌఖ్యమును కలుగజేసుకొనుటకు అవకాశమున్నది. అటుగాకయిప్పుడు వీరెల్లరుతిరిగి ప్రజలనుహింసపుచ్చుట కేదోక్రొత్తపద్ధతిని లేవనెత్తుటకు ఊటీకొండలలో మంతనములు చేయుచున్నారట. ఇట్టిజమీందార్లను మధ్యతరగతిః ప్రభుత్వము—రయితు—మధ్యఉండరాదు. తగిన పరిహారమిచ్చియైనను ఈజమీందారీవిధానముసాధ్యమైనంత త్వరలో రద్దుఅగుటకు తగినంతఆందోళనచేయుట అవసరమైయున్నది. అట్లురద్దుఅయ్యేలోగా ఈక్రిందికోరికలతోకూడిన ఎస్టేటులాండుయాక్టు సవరణచట్టము శాసనసభలలో ఆమోదింపబడవలయును.

జమీందారీ స్వంతకమతములపేరిటగల వేలకొలదియెకరముల భూమిని గవర్నమెంటు గ్రామములలోని శిస్తురేటుకే ఆజమీప్రజలలో భూమిలేనివారికి, ముఖ్యముగా హరిజనులకు, సహకారపద్ధతిమీద వ్యవసాయము వంశపారంపర్య దానదమనవిక్రయార్హతను లేకుండ వ్యవసాయముచేసుకొనుటకు హక్కు నిచ్చుట. తీరువరేట్లు, శిస్తురిమిషన్ పద్ధతి, జమీశిస్తులరాలు, అన్నియూగవర్నమెంటు గ్రామములలోనిరేట్లకన్నా ఎట్టిపరిస్థితులందును హెచ్చుండరాదు.

భూమిశిస్తు గాక జమీందార్లు రైతులయొక్క—అమాయికత్వను ఊతగాగొని వసూలుచేయుచున్నమాగాణిపై హెచ్చుశిస్తు తాళ్లశిస్తు వగైరా అక్రమపుశెస్సులేవియు వసూలు చేయకుండునట్లును అట్లుగావసూలుచేసిన క్రిమినల్ శిక్షకుపాత్రులగునట్లును నిర్వచింపవలెను.

జమీందారీలు రద్దగులోగా జమీందార్లుచెల్లించుపేష్కస్‌పోను, నిలువ ఆదాయములో కొంతభాగను ప్రజలవిద్యాభివృద్ధికిని, పల్లెగ్రామముల బాటలసౌకర్యములకును, ఆరోగ్యాభివృద్ధికిని, విధిగాఖర్చుపెట్టవలెననెడి నియమముంచి, రైతులనుండివసూలుచేయు పన్నులమొత్తముసెల్ల రైతుల ఉపయోగములకై సద్వినియోగపరచుచుండవలెనేగాని తమ భోగలాలసతకు వినియోగింపరాదను ధర్మసూత్రమును కచ్చితముగ అచరించునటులచేయవలెను.

### ఆంధ్రవిశ్వ విద్యాలయము

మనము ప్రత్యేక విశ్వవిద్యాలయము కోరినది ఆంధ్రులలో కొలదిమంది ఉద్యోగములను సంపాదించుటయను అల్పప్రయోజనముతోగాను. దేశభాషలందు తెలుగులెస్సయని శ్రీకృష్ణదేవరాయనిచే కీర్తింపబడిన మనమాతృభాషాభివృద్ధికై దేశకాలపాత్రములననుసరించి నూతనపంథానుసరణోత్కృష్టగ్రంథములను రచింపజేయుటకును, విద్యార్థులకు సమస్త విషయములను మాతృభాషయందె బోధించి భాషాసేవయు విజ్ఞానాభివృద్ధియు తగినంతగాకలుగజేయుటకును అయియున్నది. మనఆంధ్రులలో మహాప్రభావంతులని కీర్తివందిన రామలింగారెడ్డిగారును, రాధాకృష్ణగారును దీనికిఉపాధ్యక్షులైకార్యనిర్వాహణ మొనర్చిరి. నేటికిన్ని రెడ్డిగారేపాలించుచున్నారు. వీరిరువురును మనయున్నతాదర్శములనేమాత్రము చేరలేకపోయిరి. ప్రాతమద్రాసు విశ్వవిద్యాలయపు అడుగుజాడలను నడచుటతప్ప మనప్రత్యేకతనేమియు వెల్లడించకపోయిరి. ఆంగ్లభాషతప్ప మిగత విషయములనెల్ల ఆంధ్రమున బోధించవలెననెడి కట్టడిపూర్తిగకలుగజేసి, ప్రతివిద్యార్థికిని నేను ఆంధ్రుడను, నాభాషఆంధ్రభాష, ఇతర భాషలలోగల ఉత్కృష్టగ్రంథరాజములనెల్ల నేను నామాతృభాషయందు చదువగలుగుచున్నాననెడి ఆత్మతృప్తికలిగించలేకపోయిరి.

౧౩ వ పేజీ చూడుడు

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K. Balakrishna Reddy